# DEVIBHAGAVATAM.

## Skandha 6.



BY
TIRUPATI VENKATESWARA KAVULU,
*SATAVADHANEES, &c. &c. &c.*

FIRST E[illegible]
1,000 c[illegible]

PRINTED
SREE BHYR [illegible]
MASULIP[illegible]

Price 12 [illegible]

1915

శ్రీమత్పరదేవతాయై నమః.

శ్రీ.

# దేవీభాగవతము.

## షష్ఠస్కంధము.

ఇది

శ్రీ తిరుపతి వేంకటేశ్వరులచే

రచియింపఁబడి,

శ్రీ భైరవముద్రాక్షరశాలయందు,

ముద్రింపఁబడియె

మొదటికూర్పు 1,000 ప్రతులు.

మచిలీబందరు.

దీనివెల రు 0-12-0.



1915.

# విషయసూచిక.



☞ 10-వ పుటలో, ౧౧వ, కం॥ పద్యమునందలి యుత్తరార్థము నీవిధమున మార్చికోఁదగు,

“నరుల విశేషం బేమిఁక, సురుచిరమగు జ్ఞానగరిమ చొప్పడ దేనిన్.

శ్రీమత్పరదేవతాయైనమః.

# దేవీ భాగవతము.

## తిరుపతి వేంకటీయము.

## షష్ఠ స్కంధము.



మంగళతరహృదయ సర్వో
త్తమచిత్రచరిత్ర శాస్త్రతత్త్వజ్ఞ కలా
బ్ధిమహిత సుమహిత సతత
భ్రమరహిత మనోజ్ఞమూర్తి బ్రహ్మయశాస్త్రీ ౧

వ॥ అవధరింపు మంగళాకారంబ శౌనకాదులు సూతుంగాంచి.

సీ॥ పరమవిజ్ఞానియైన ద్వైపాయనమునిం, గొలిచి శ్రమచేసి విద్యలంగొంటి
వనఘ, నీకువచనామృతంబు నన్నించి త్రావు, కోరెదిమా కాద
రంబెక్కఁ గొనసాగొనసరి ౨

చ॥ సురల నిసర్గమహామహులు సముంచితబుద్ధివిశాలు రిమ్మునీ
శ్వరులు శ్రుతిప్రసిద్ధ మగుసత్కథ నొక్కఁడు గోరనెంచి రా
దరముగఁ జెప్పుమయ్య మును త్వష్టకుమారుఁడు వృత్రుఁ డప్పురం
దరునికి శెమ్మునన్ రణమునన్ మృతుఁ డౌట ప్రసిద్ధమేకదా. ౩

వ॥ సురపక్షీయుండగు త్వష్టకుఁ గొమరుండైన వృత్రునివధించు
టకు సత్త్వగుణోత్పన్నుం డగుశక్రుం డెట్లంగీకరించె? విష్ణుం డీకృత్య
మ్మునకుఁ దోడ్పడి పవిమధ్యమ్మున నెట్లు డాఁగె? నిత్యాది సత్త్వమూర్తి
యగునతనికిం దగునే? యని మఱియును. ౪

క॥ ఇరువురు హరులును సత్యం, బరయక జలఫేనమున మహామహు

వృత్రుఁ, హరియించిరికద ? ధర్మ్మవు, మరియూద యొకింత వలదె
మహానీయులకున్.                                                       ౭

క॥ కేవలమిషగతి విశ్వా, సావహు నొనరించి వృత్రుహరియించినయ
ద్దేవపతి బ్రహ్మహత్యా, పావృతుఁడై లోకనిందఁబడయఁగ లేదే.

వ॥ ఇదియిట్లుండ నీవు వృత్రుండు దేవిచే నిహతుండయ్యెనని
నుడివితి వదియెట్లనవుడు సూతుండు మునులంగని యిట్లను మునులా
రా! సావధానులరై యాలింపుఁడు మీయట్ల జనమేజయుండు పరాశర
సూతి కిట్లనియె.                                                       ౯

క॥ హరి హరిసాహాయ్యమ్మునఁ, బొరిగొనె వృత్రు నని దేవి పొరిగొనె
నను టె, క్కరణి లగియించు? నొక్కరుఁ, డిరువురవధ కెట్లు విష
యుఁ డెటిఁగింపు మొగిన్.                                                ౧౦

క॥ పరమోత్తములనఘులు సత్త్వరతులగణ్యపరిభావధన్యులు లోకో
త్తరు లగువుణ్యాత్ములస, చ్చరితలు వినుకతనజన్మసాఫల్య మగున్.

వ॥ నావుడు వ్యాసుం డిట్లనియె,

క॥ నరవర! ధన్యుఁడ వీ వో, క్కరుఁడవె సచ్చరిత లిట్లు కాంక్షింతువెత
త్పరులై వినువారుండినఁ,బరమప్రీతి యగు నొడువువారికినెందున్.

ఉ॥ వేదములం బురాణముల విశ్రుతమై తగుఁ ద్వాష్ట్రి ధర్మ్మమ
ర్యాదకుఁ దక్కి విష్ణుని సహాయునిఁ గాఁ గొని పాకవైరి దా
ఛేదిలఁజేసి దుఃఖమును బెల్లుగ నందె నటంచు; మాయఁ బెం
పేది మునీంద్రులే కుటిలకృత్యములం బడ నొడ్డశక్యమే.                        ౧౧

గీ॥ ఈతఁ డొక్కరుఁ డన నేల కృష్ణుఁ డకట?, సత్త్వవిగ్రహుఁ డట్ల
మిషగతిఁ దునిమె, రక్కసులనెల్ల జ్ఞానంబు నుక్కడంచు,మాయ
భగవతి యేరి కజేయ గాదె.                                            ౧౨

క॥ వేలకొలఁదియుగముల మా, యాలీలన్ జలచరాది కాకారమ్ముల్
దాలిచి హితాహితము, లోలిం దెలియకయ విష్ణు వొనరుచు
ననఘా.                                                              ౧౩

చ॥ హరి యన నొక్కఁడేమి జను లందఱు గాయకతమ్మునన్ బరా
పరము దెలుంగ లేక సదుపాయము గానక సాధనంబు నా
తరుణి, యటంచు మోహమునఁ దద్దయు మున్గుచుఁ దేలుచుం బొన
ర్తురు సుకృతమ్ము దుష్కృతము తుందుడుకొప్పఁ బరీక్షిదాత్మజా.

క॥ నరుఁ డొక్కరుఁడును మాయా, తరణోపాయం బెఱుంగఁ దగఁడు హరిపురం, దరు లావృత్రాసురునన్, బోరిఁ గొనుటయుఁ దన్మయత్వమునన నృపాలా. ౧౫

గీ॥ స్వార్థసాధనతత్పరతాత్ములగుచు, హరిపురందరులు నెపము నలవరించి పొలియఁ జేసిరి వృత్రునిఁ బూర్వవైర, కారణంబువచించెదధారుణీశ

గీ॥ దివిజులకు నెల్ల ఘనుఁడు భూదేవహితుఁడు, కలఁడు త్వష్టృప్రజాపతి కడుఁ దపస్వి, యతఁడు సృజియించెఁ ద్రిశిరస్కుఁ డైన పుత్రు, విశ్వరూపుని నింద్ర విద్వేష మెనయ ౧౬

విశ్వరూపుఁడు తపమ్ము సల్పుట

క॥ వనమ్ములు మూడింటన్, బనపడి వేత్తైసపనులు పచరించుచు స ద్విదితగతివృద్ధిఁ జెందెన్, మునుమునఁ దనుఁ జూచి యెల్ల మునులు నుతింపన్

గీ॥ ఒక్క మొగమున వేదమ్ము నొగిఁ బఠించు, నొక్క మొగమున సురఁ ద్రావు నొక్క మొగమున, నన్ సమస్తప్రపంచమ్మునన్ గలుగువి, శేషములు చూచునతఁడు మనీషిహితుఁడు ౧౮

క॥ తపమాచరించెఁ బంచా, గ్నిపరీతుండగుచుఁ దగ నకిల్బిషబుద్ధిన్ విపరీతశ్రద్ధాధ, ర్మ పరాయణుఁడగుచుఁ దన్ను మాన్యులు మెచ్చన్

గీ॥ పాదపాగ్రమ్ముపై నొకపరి వసించి, పుండువంటిచలిని నీటనుండి మండు వేసవిని జుట్టు నగ్నులవిసువకునిచి, యతఁడు దపమాచరించు నాహార మెడలి

గీ॥ అట్లు తపమాచరించుచు నయ్యనఘుఁ గాంచి, తన పదవి నీతఁడు హరించు నను చు నెంచి, తపము విఘ్నం బొనర్చెడి తలఁపు మించి, యిందుఁడు సభాస్థలమునకు నేగుదెంచి ౨౨

వ॥ కాముమ్మునఁ దపం బడంగు నని రంభోర్వశీ మేనకలం బిలువం బంచి తారుణ్యమదగర్వి తలగు నక్కాంతల కిట్లనియె. ౨౩

ఆ॥ వె॥ పూడుతెలలతపసి మునుకొని నాదుసిం, హాసనము హరించుస బలలార?, మెట్టు లైనమీరు నెట్టనవానిత, పమ్ము చెఱచినిలుపవలయునన్ను

క॥ సింగారములూనికన, త్సంగీతరవముల నాట్యసంగతులఁ గలా భంగుల రంగుల నతని న, నంగుని గొల్పింపవలయునంగనలారా.

వ॥ అనికనికరం బుట్టిపడఁ దమ్ముం గోరుశచీపతి కచ్చరలిట్లనిరి

చ॥ తలరఁగనేల? యబ్బురపుఁదళ్కులఁ గుల్కులఁ బల్కులన్ ఝుళం ఝుళితవిరావ నూపురలసత్పదసంగతి నొప్పలాస్యరీ తుల మృదుగానపద్ధతులఁ దోంపు నేరుపు గల్గు బెళ్కుచూ పుల వివశుం బొనర్చి మునిపుంగవు దానునిగాఁగ నేలమే ౨౫

వ॥ అనిచెప్పి యమ్మునియాశ్రిమమ్మున కరిగి.

క॥ పాడుదురుసుస్వరమ్ముగ, నాడుదురుల యానుగతులన భినయమున బల్ పోఁడిమి నెఱపుదురుమునికి, రూడిగఁగఱగింప వేల్పురోయింతలొగిన్

క॥ నా కాంగన లతినైపుణి, మేకొనఁగ నొనర్చునట్టిమేళపుఁగృతులన్ మూకాంధబధిరపద్ధతి, గైకొని యతఁడించు కేనిఁగఱఁగఁడు వింటే

వ॥ అచ్చరలును నచ్చుటఁ గొన్ని దినమ్ము లుండి యతనిధైర్యమ్మున కచ్చెరువడి మరలి యిందునికడ కరిగి దీనాననమ్ములతో నిట్లనిరి.

ఉ॥ చేసితి మిన్నినా వ్యుత్పత్తిని చెంత శ్రిమంపడి హావభావవి న్యాసములన్ రసాభినయ నాట్యమృదంగరవానుషంగపీ ణాసరసస్వరానుమతసప్తగుణోల్బణగాన మాదిగాఁ జేసెడిచేష్టలన్నియును: జెక్కుచెమర్పదు మౌని కింతయున్. ౩౨

గీ॥ ఎన్ని చేసిన నాతనియెడలఁ బూదెఁ, బోయు పన్నిరు”లాయెమాసోయు గములు, శాపహతిఁగంచకే నీదుసన్నిధికి న, దృష్టమున వచ్చితిమి దేవదేవ? మరల. ౩౩

క॥ నావుడు దివిజేంద్రుం డ, ప్పావనుఁ డగు మౌనివరునిఁ బరిమార్పఁగఁ జిం
తావిష్టుఁ డయ్యె నది మును, భావహమగు కృత్యమును మనారయఁ డధిపా

వ॥ ఇట్లింద్రుండు దుర్మనస్కుండై గజమ్ము నధిష్ఠించి తపస్సమాధిదీక్షితుండగు నమ్మునివరు నీక్షించి. 3౫

చ॥ తపసి మహానుభావుఁ డతిదాంతుఁ డటంచును కీశఁ డాత్మకున్
రిపుఁ డగు నంచు వజ్రి మలరించి కరమ్మున నైచెఁ దద్ధతిన్
వ్యపగతజీవుఁ డై పడియె నమ్ముని, మౌనులు శోక మంది యీ దే
వపతి యిదేఁ తపస్వుల నపాపులఁ జంపఁగ నేల యక్కటా. 3౬

క॥ అని యాక్రోశింపుచు నీ, మ్యనఘునిఁ బొరిగొన్న యాతఁడు చిరమ్ము సదుః
ఖనియతుఁ డగుననిపల్కిరి, చనియె సురేంద్రుండు తన సుసదనమ్మునకున్

వ॥ అంత నమ్మునివజ్రనిహతుం డయ్యును జీవసహితుండునుం బోలె ననర్గళ తేజమ్మునన్ బొల్చు మునీంద్రుం డితండు పునర్జీవితుం డగు నొకో! యని శంకించి తత్సుతుం బిలిచి యిట్లనియె. 3౭

ఆ॥ వె॥ అనఘుఁ డితఁడు వజ్రిహతుఁ డయ్యుజీవస, హితుని వమన్ జెంది
యొసఁగుచున్న, వాఁడు మరల బ్రతుకునడయని గతి శిర, ములను జెక్కు
మనుడుఁ బలికె నతఁడు 3౮

చ॥ అకట? యితండు వజ్రిహతుఁడై మృతి చెందె మృతున్ వధించి పా
తకమునఁ బోవనేర్తునె వృథాగతి విప్రునిఁ జంపఁ జొచ్చితే
మికతనమో యెఱుంగ వినుమీ యిది పెద్దకళేబరంబు మా
మక పరశు ప్రచారము సమగ్రతమైఁ దఱుగంగ నేర్చునే॥ ౪

క॥ మృతుఁ డయ్యె నితఁడు నిక్కము, పితగాఁడిలఁ దఱుగ నేల నీ విం తకునీ
వితనికి తనభంగుమందిన, హితము దెలియంగఁ జెప్పవే? నాకనుడున్

వ॥ ఇంద్రుండిట్లను నితండు మహానుభావుం డగు ముని యయ్యును నాకు శత్రుం డగుటం జేసి యొబ్బంగి నైననరివధకర్జంబగుట నితని వధించితి ౪౧

క॥ హతుఁ డయ్యును బ్రతుకుంగను, హితమునఁ దనప్పై ధర్మవిదులగ్ని ఋణా
ప్రతిపనీక శేషముంచిన, కతన న్మమ ప్రొదవు నంద్రిగాదే యెందున్

వ॥ అనిన నతం డిట్లను నిట్టి నిరపరాధి యగు బ్రహ్మతేజస్కుఁ దపస్వి వధింప నుంకించిన నీకు బ్రహ్మహత్యాభయంబు లేదే నావుడు నింద్రుం డిట్లనియె. ౪౪

ఆ॥ వె॥ బ్రహ్మహత్య కేనుభయపడ శత్రుశేషమ్ము కతనవామనమ్ము కలఁక చెందఁజొచ్చెఁ బాపచేష్టప్రతిక్రియ, వలనఁ బాపికొనఁ గవచ్చు ననఘ

వ॥ ఎట్టి పాపియుఁ బ్రాయశ్చిత్తం బొనర్చినను శత్రుశేషంబు నశింపదు గానఁ బాపపుణ్యమ్ములెంచక యేగతినైన శత్రుఁడు వధ్యుండు నావుడుఁ దక్షుం డిట్లనియె. ౪౬

గీ॥ ఈవు లోభాభిహతిఁ జేసి యిట్టిపాప, కృత్యమునకియ్యకొంటివొ క్కి ంత యేని, లోభ మెనయ నినాకెట్టులు హితమిట్టి, యహితకృత్యం బటన్న నిట్లను బలారి. ౪౭

వ॥ అట్లని నీకిది మొదలు జన్మముల భాగం బేర్పఱచెద యజ్ఞార్థంబగు పశువు శిరంబు నీయది నావుడు సమ్మతించి తక్షుం డతని శిరమ్ములఁ దనపరశువున నఱికె నంతట. ౪౮

క॥ శిరములు ధరఁ బడు నాలోఁ, గర మాశ్చర్యంబు వొడమఁగ వేలకొలం దిరహి జనించెం బక్షులు, తరతరమ శిరములనుండి ధరణీనాథా.

వ॥ శ్రుత్యధ్యయనమ్మును సోమపానమ్మును నొనర్చు ముఖమ్మునఁ గపింజలమ్ములును సర్వదిఙ్నిరీక్షణం బొనర్చు మొగమ్మునఁ దిత్తిరిపక్షులును గలుదారిపువక్త్రమ్మునఁ గలవింకమ్ములును బొడమె నంత నింద్రుండు దన్నుం గృతకృత్యునిఁగా నెంచికొని బ్రహ్మహత్యం బాపికొన నెంచు నంతఁ ద్వష్టృప్రజాపతి తనపుత్రు మరణమ్ము విని యింద్రునిమీఁద నగ్గలపు టలుకవొడమి యిట్లను. ౫౦

క॥ కనుఁగొనుఁడు సురలు నాదగు, తనయుని రపరాధు మానతత్పరు నింజం పిన యింద్రుని గీటడఁగిం, పనొక మహాబలునిఁ బుత్రుఁ బ్రసవింతు నొగిన్.

వ॥ అని కృతనిశ్చయుండై యధర్వణోదితమ్ము లగు మంత్రమ్ముల నగ్ని నారాధించి వ్రేల్చినఁ దత్కుండమ్మునుండి పావకుండునుం బోని

యొక్క జాజ్వల్యమానశరీరుండగు సుతుండు పుట్టిన వానిం గాంచి త్వష్ట యిట్లను. ౧౨

క॥ ఆవిర్భవింప నేమును, కేవలమింద్రుని బలమ్ము గీటడఁగింపం
గా వైరి వగుచు నిప్పుడ, వేవృద్ధిం బొందు మనదివిజులు వడంకన్.

గీ॥ అంతలోఁ బర్వతాకారుఁడై యతండు, కాలమృత్యువు నాఁ దండ్రిఁ
గాంచి పలుకు, నాదుపే రేమి? యేకారణమున నన్ను, సృష్టి చేసితి?
నీ కేల చింత సెప్పుము. ౧౪

## వృత్రాసురోత్పత్తి

క॥ నీమదిని గలుగుకోరిక, సామాన్యము గాని దేని సాధించెద వాఁ
డేమిటికిఁ దండ్రికిఁ గల, కామము నెఱవేర్ప లేని కాపురుషుఁ డిలన్.

చ॥ సురల హరింతునో? జముని చొప్పడఁగింతునొ? యింద్రుఁ ద్రుంతునో?
వరుణు నడంతునో? శశిదివాకరులన్ వధియింతునో? ధరా
ధరముల ముక్కుముక్కలుగ దంతునొ? యీజలరాసులన్ సము
ద్ధురగతిఁ ద్రావ నెంతునొ? సుతున్ ననుఁ బంపు మనంగ నాతఁడున్.

వ॥ కొమరున కిట్లను నీవు వృజినమ్ముకతన రక్షింప నుద్భవించుటం జేసి వృత్రుండవనఁ బరఁగి త్రిశిరస్కుండును దపోనిష్ఠాగరిష్ఠుండును వేదవేదాంగతత్త్వజ్ఞుండును నగు నీయన్న ననపరాధు వధించిన బ్రహ్మఘ్ను నింద్రు వధియింపు మని చెప్పి ౧౭

గీ॥ తనయశోకాకులుండయి త్వష్ట వివిధ, గతుల నాయుధములు చేసి
యతులబలున, కాత్మజాతున కిచ్చి యింద్రాదిసురలఁ, బోరిగొనెడి
పూన్కిమైఁ బంచెఁ ద్వరయెలర్ప. ౧౮

వ॥ పదంపడి వృత్రుండు శుభదినమ్మున బ్రాహ్మణాశీర్వచపూర్వకంబుగఁ బితృదత్తం బగురథం బధిష్ఠించి తద్దత్తమ్ము లగుఖడ్గశూలగదాతోమరపరిఘపట్టసాద్యాయుధమ్ములును సహస్రారంబై సువర్ణంబునుం బోని చక్రమ్మును దివ్యం బగుకవచమ్మును నక్షయతూణీరమ్ములును ధనుర్బాణమ్ములును ధరియించి యున్న దేవతలచే ధిక్కృతు లగురక్కసులు

తోడుగా శత్రుహననార్థమ్ముగా వెడలుటయు దూతలు వైళంబ చని యింద్రునితో నిట్లనిరి. ౫౯

గీ॥ పుత్రశోకాతురుండు త్వష్ట పుట్టఁజేసె,నినువధించుటకై వృత్రుఁ డనెడిక్రూరుని, మేరుమందరతుల్యుఁ డమ్మేటి వచ్చె, బలియు రగురక్కసులు చుట్టు బలిసి కొలువ. ౬౦

వ॥ ఆలోనన వృత్రసైన్యదర్శనమాత్రపలాయమానులై కొందఱు దేవత లచ్చటికి వచ్చి యిట్లనిరి. ౬౧

క॥ దేవా? దేవరపురమున, భావింపఁగ రాక ప్రబలభయజనకంబై యావిర్భవించె దుశ్శకు, నావళి దైవగతి కేమి యనఁదగు నకటా.

సీ॥ కాకగృధ్రమ్ములు కంకముల్ శ్యేనముల్ "చీచికూచి" ధ్వనుల్ సేయుఁ దొడఁగె, వాహనమ్ములు నీరు వర్షింపఁగాఁ జొచ్చె నేత్రాంచలమ్ముల నిశలయందు, భవనమ్ములకుఁ బయిపైనుండి రాక్షసు లఱవఁ జొచ్చిరి వాతహతి చెనయక, ధ్వజములు పడఁజొచ్చెఁ దరుణులు గొంటఱు నీలవస్త్రమ్ముల నోలిఁ దాల్చి.

గీ॥ వికృతిమెయి నిల్లిలుఁ జరింతు రకట? స్వప్న, మందుఁగాంతల రక్కసు లడఁచి కొప్పు,లీడ్చినట్లగు భూకంప మెనయు నక్క, లఱచు సరటలు పుట్టు గృహమ్ముల౯దు ౬౩

వ॥ అని దివిజులు పల్కిన నిందుంఁడు భయాతురుండై బృహస్పతిం గని యిట్లను. ౬౪

క॥ ఇల నలకాపాతమ్ములు, వొలుచు నభస్థలమునుండి పోరిఁబోరి వాతంబులు దారుణగతి దగునిఁకఁ,గల తెఱఁగుందెలిసి శాంతిగావింపఁగ దే.

వ॥ నావుడు గురుం డిట్లనియె.

గీ॥ నెట్టపంటఁగఁ జంపితి నిరపరాధుఁ, డైనమునివర్య నీకు నద్దాన నేమి ఫలము సమకూరె నిప్పు డప్పాపకర్మ,మేల నినుఁ గట్టి కుడుపక తేల విడుచు. ౬౬

క॥ ఏపనినైనను దగఁ దా, నోపివిచారించి చేయు టొప్పగుఁ గాదే

నాపదలకు మూలంబై, కాపుర మగు వానిబ్రతుకు గష్టమ్ములకున్.

గీ॥ మోహలోభమ్ములం జేసి మొదల బ్రహ్మ, హత్య మెడఁ గట్టికొంటి వే మందు నిన్ను, ఫలము వైళమ కనుపట్టు నల్పపుణ్య, పాపముల కను పెద్దలపలుకు వినవె. ౬౮

క॥ అరయఁగ వినువరపీడా, పరాయణుఁడు సౌఖ్యములను బడయఁడు నీకుం బరిభూతికిఁ దఱియఁడయ్యెన్, గరము నవధ్యుండు వాఁ డఖండుఁడు బలిమిన్. ౬౯

ఆ॥ వె॥ త్వష్ట యిచ్చె నాయుధములు వానికి నీదు, వజ్ర మొక్కడు దానిపాటి గాదు, వేయుమాట లేల? వృత్రుండు మీపాటి, వాఁడు గాఁడు మేటి వానిధాటి. ౭౦

క॥ దేవేంద్రప్రళయమ్మున, కై వచ్చుచున్న వాఁ డహంకృతిమై నాఁగా విని మునులును యక్షులు, దేవతలును బరుగు లిడిరి దిగు లెదఁ గదురన్.

వ॥ సదనమ్ములన్ విడిచి పలాయనం బొనర్చునమరులం గని యింద్రుండు చింతాపరుండై సేవకుల కిట్లను. ౭౧

క॥ పిలువుఁడు రుద్రులను దినకరుల వసువుల ధనదయమవరుణులన్ "మీరల్, దలరక విమానములపై, నెలకొని సన్నద్ధులై యనికిరం" డనుచున్. ౭౨

వ॥ ఇట్లు నియోగించి యతండు బృహస్పతి పురస్సరమ్ముగా గజారూఢుండై సంగరమ్మునకుం జనియె నంత దేవతలును దమతమయాయుధమ్ములతో బిఱుందన చనిరి. ౭౩

గీ॥ వృత్రుఁడును దానవులతోడ వేడ్క మెఱయ, నరుగుదెంచెను మానసోత్తరసమీప, మునకు నప్పర్వతమ్మున మొనసె రెండు, సేనలును వృత్రవాసవుల్ చెలఁగి యచట ౭౪

గీ॥ ఒక రొకరిఁ జంప నుంకించి యుత్కటముఁగ, బరిఘపట్టసకరవాలపాశ

బాణ, శక్తిముఖసాధనమ్ముల సంగరమ్ము, సలిపి రొకనూఱువత్సరమ్ము
లోకరీతి. ౭౫

వ॥ ఇట్లు మానుషపరిమాణమ్మున శతవత్సరమ్ములు సంగరం బభం
గురమ్ముగాఁ బ్రవర్తిల్లిన నది సర్వలోకభయంకరం బయ్యెనంత. ౭౬

చ॥ వరుణుఁడు పాఱె నాపయిని వాయుగణంబు చలించె వెన్కకుం
దిరిగె జముండు; పావకుఁడు దీప్తికిఁ దక్కెఁ గ్రమక్రమమ్ముగా
సురపతికిం బలాయనము చొప్పడె నంతట నిట్లొనర్చి ని
ర్జరమథనుండు వృత్రుఁడు వెసం జని తండ్రికి మ్రొక్కి యిట్లనున్.

మ॥ వరుణుం దోలితి వాసవుం గెలిచితిన్ వంచించితిన్ వాయువున్
సరసీజాప్తు నడంచితిన్ జ్వలనుపై సంరంభముం జూపితిన్
సురలన్ రేఁపితి 'భీతమారణ' మటంచుం జంప నిం దొక్కనిన్
హరిభీతిం బడునేన్గులై రిపులుద్యద్భీతి నాధాటికిన్. ౭౮

గీ॥ ఇంద్రుఁ డరిగెఁ బదాతియై యేన్గుఁ బట్టి, కానుకగఁ దెచ్చితిని దీనిఁ
గనుము దేవ, యేమి యొనరింతు వివరించి యెఱుఁగఁ జెప్పుము, దుష్క
రంబేనిఁ జేయుదుఁ దొడరి దాని. ౭౯

వ॥ అనుకుమారునకుఁ ద్వష్ట సంతుష్టుండై యిట్లను.

గీ॥ కన్నవారలలోనఁ బొగడ్త కెక్కి, మానసజ్వరముదు పీడి మనుట
గల్గె, నీపరాక్రమమహిమ వర్ణింపఁ దరమె, జీవితమ్ము ఫలించె సుస్థి
రుఁడ నైతి. ౮౦

వ॥ ఇంక నీకుఁ గర్తవ్యంబు విను మెప్పటికినిఁ బాకశాసను విశ్వ
సింపఁ దగదు గావున నతనిదురుపాయమ్ములకుఁ దలరక చతురాననుం
గుఱిచి తపం బొనరించి యవధ్యుండవై యింద్రు నడంపుము. ౮౧

గీ॥ తపము యశ మిచ్చు బల మిడుఁ దాప మడఁచు, లచ్చి నొడఁగూర్చు
రాజ్యవిలాస మొసఁగుఁ, దపమిడనిదొక్కటియు లేదు దాని సలుపు,
మయ్య! యవధానివై శక్రు నడఁపుమయ్య. ౮౨

ఉ॥ కంటికి నిద్ర రాదు సుతఘాతుకుఁడై నబలారిచేత నా
కంటికి బుద్ధి పోదకట? కల్మషమించుకయేని లేక మి
న్నంటుగతిన్ మహాతపము నంది తనంత వసించుపుత్రకున్
గంటకుఁడై హరించె నిఁకఁ గల్గునె శాంతి కుమార? నామదిన్. ౮౩

వ॥ అను తండ్రి యానతిం గొని పుత్రుండు క్రోధావేశమ్మున గంధమాదనమ్మున కరిగి. ౮౪

చ॥ అమరధునిన్ మునుంగుచుఁ గుశాసనమందు వసించి వారిపా
నము మొదలన్నియున్ విడిచి న్యాయగతిన్ బొలుపొందియోగమం
దు మనము నుంచి యయ్యజునిఁ దోరపుశ్రద్ధమెయిం గుఱించి చే
సె మునులు మెచ్చఁగాఁ దపముచిత్తమునన్ భయమందెనింద్రుఁడున్.

వ॥ అట్లతనితపమ్మునకుఁ దలంకి దివిజేశ్వరుండు యక్షకిన్నరపన్నగవిద్యాధరసహితమ్ముగా నచ్చరలం బనిచిన వార లొనరించువిఘ్నకృత్యుల కతండు చలింపక సుస్థిరుండై యుండె నంత వారలును నింద్రుకడ కరిగి యతండు మాకు వంచింపఁబాటివాఁడుగాఁ డని మిన్నకుండి రట్లు తప మొక్కనూఱువత్సరమ్ము లొనర్చినఁ బితామహుండు హంసారూఢుండై యతనికిఁ బ్రత్యక్షమై యిట్లనియె. ౮౬

ఉ॥ నీదుతపోవిశేషమున నెమ్మది సమ్మదమందెఁ ద్వష్టృదా
యాద! సుఖమ్ములం జెలఁగుమయ్య! యిఁకన్ దపముం ద్యజించి నీ
కేది యభీప్సితంబు తగ నిచ్చెదఁ గోరఁగదయ్య! నా నతం
డాదరమేదురత్వఘటితాంజలియై రచితప్రణాముఁడై. ౮౭

క॥ ఇంతకుఁ బూర్వము ముదిత, స్వాంతుఁడనై దేవపదము సాధించితినేఁ
డంతకు నెక్కుడుగాదే, చింతితఫలదంబు నీదుసేవ లభించెన్. ౮౮

వ॥ ధన్యుండనైతి నాకు వరంబు నొసంగ నిచ్చయేని లోహకాష్ఠశుష్కార్ద్రవంశనిచయమ్ములచేతను నపరమ్ము లగు శస్త్రమ్ములచేతను మృతి లేకుండుటయు సంగరమ్మున మద్వీర్యమ్ము నానాఁటికి వృద్ధినొందుటయు ననుగ్రహింపుము నావుడు విరించి యటు లగుఁ గాక యని తన

భువనమ్మున కరిగె వృత్రుండును సంతసమ్మునఁ దనతండ్రికడ కరిగి కడ
చిన దెల్ల నుడివిన నతం డిట్లను. ౮౯

గీ॥ భద్రమగుఁ గాక నీకు నిర్భయుఁడవగుచు, నగ్రజాతుఁ ద్రిశీర్షునినవప
రాధు । నెట్టపంటఁగఁ జంపినయట్టి యింద్రు, బ్రహ్మఘాతుకువధియిం
చి ప్రబలుమయ్య. ౯౦

గీ॥ బ్రతికియున్నప్డు మాటను బాటి చేసి, మృతి గనినతద్దినమున వి
స్మృతముగాఁగ, నన్నదానం బొసంగి పిండాదికంబు, గయ నొసఁగు
వాఁడు పుత్త్రుఁడు కాఁగలాఁడు. ౯౧

క॥ కావున నాయాపతిఁ గొని, వేవేగ వధింపుమీ? దివిజవల్లభుఁ బా
పాపహుఁడై నీయన్నకుఁ, గేవలసుకృతపరిచారుఁ గీటడగించెన్. ౯౨

వ॥ ఇట్లానతిచ్చిన వృత్రుండు దుందుభిఘోషమ్ములు సెలంగ శం
ఖారావంబు లలర మహాబలసంయుతుండై రథారూఢుండై బయలు
వెడలి తనసైనికులఁ గని తప్పక యింద్రుని వధించి సురరాజ్యంబు గై
కొందు నని పల్కుచు నమరావతిం దనసేనానివహమ్ముల నదల్చుచుఁ జను
నంతట నింద్రుండును నెఱింగి యుద్ధసన్నద్ధుండై లోకపాలసహితమ్ముగా
మొగిసి గృధ్రవ్యూహంబు పన్ని నిలిచె. ౯౩

క॥ ఇరువురకుఁ బరస్పరవిజ, యరమాలోలురకు శస్త్రహతిగళదసుర
క్తరుచిఖచితదేహులకున్, బరమాద్భుతరీతి రణము వఱలె నృపాలా

క॥ దివిజులు దైత్యులు రణవై, భవ మెల్లరు మెచ్చఁ బరశుపరిఘాదులను
క్కు వెలయఁగఁ గొట్టుకొని రొ, క్కవిధమ్మున నక్కజమ్ముగా జయ
కాంక్షన్. ౯౫

## వృత్రుం డింద్రుని మ్రింగుట.

వ॥ ఇట్లు సంగరంబు జరుగునెడ వృత్రుండు క్రోధదీప్తుండై యిం
ద్రుంబట్టుకొని వక్త్రమ్మునం దిడికొనుటయు దేవతలు పరమార్తులై శక్రు
నికి నాక్రోశించుచు బృహస్పతికడ కేగి తద్విముక్త్యుపాయంబు వచియిం
పుమని వేఁడుదు నతం డిట్లను. ౯౬

క॥ ఏ నేమి సేయఁగల నవ్వాని ముఖాంతర మనుపెనుబంధనమున స
 ప్రాణుండై యిప్పటికిని, దీనుండై యున్నవాఁడు దేవపతి దగన్.

వ॥ నాపుడు సుర లందఱును యోజించి జృంభిక యనునొక శక్తిం బుట్టించిన నయ్యది యవ్వానిముం దావేశించి యాపులింతం గలిగించె. ౯౮

క॥ వివృతాస్యుఁ డయ్యె వృత్రుఁడు, దివిజపతియుఁ దత్క్షణంబ తెరలి
 వయిఁబడెన్, గవిసి సురలెల్ల నానం,దవిభవమున మునిఁగి తేలి తని
 సిరి మిగులన్. ౯౯

వ॥ నాఁటంగోలె జృంభిక సర్వప్రాణిసంస్థితయై యిప్పటికిం జొప్పడెడిఁ బదంపడి వృత్రుం డొక్కఁ డొకకెలనను నింద్రాదు లందఱు నొకవైపునను నిలిచి ఘోరయుద్ధం బొనర్పఁ బదివేలవత్సరమ్ములు గతించె.

క॥ వరమదగర్వితుఁ డగునా,సురవైరికి నోడి పాఱి సురపతి చింతా
 భర మడర నుండె నంతట,నరుదెంచెన్ దివిజవైరి యమరావతికిన్.

గీ॥ పచ్చిపారిజాతములు నుపవనము లేన్గు, లచ్చరలుఁ గామధేనువు పది
 యిదియన, నేల?స్వర్గ్లోకమునఁ గలయెల్లరత్న. సంచయము తాన
 కైకొని మించె నెలమి. ౧౦౨

వ॥ వృత్రుం డిక్కరణి దేవపదం బేలుటకుఁ దండ్రి యానందించె సురలు స్థానభ్రష్టులై యజ్ఞభాగమ్ములు లేక తత్తద్గిరివరమ్ములపాలై యఱిగి యచ్చటిమునీంద్రులతోఁ గర్జం బేమని యోజించి తదనుమతమ్మునఁ గైలాసమ్మున కేగి మహాదేవుం బ్రార్థించి ప్రసన్నుఁ డగునాతని కిట్లనిరి.

గీ॥ దేవనగరంబు రాక్షస దేశమయ్యె, నప్సరఃకాంత లాదిగ నఖిలము
 నకు, వృత్రుఁడధినేత యతనికి వెఱచి నీదు,శరణుఁ జొచ్చితి మిఁకఁ
 గృప సలుపు మీశ. ౧౦౪

క॥ స్థానభ్రష్టులమై చిం,తానియతులమైనమమ్ము దరిఁ జేర్చి కృపా
 ధీనమతిఁ బ్రోవవేయనఁ, గా నతఁ డిట్టులను దివిజగణములతోడన్.

గీ॥ కంజజపురస్సరమ్ముగాఁ గదలి మనము, హరికడకుఁ బోద మాతఁడె
లైన వీనిఁ,జంపుఁ గపటప్రచారవిశారదుండు,కరుణ గలఁడు మహా
త్ముఁ డఖండబలుఁడు. ౧౦౬

వ॥ అని చెప్పి బయులువెడలిన నందఱును వైకుంఠమ్మున కరిగి
యద్దేవుం బురుషసూక్తవిధానమ్మున యజించిన భక్తవత్సలుం డతండు
ప్రత్యక్షమై వారలఁ దగుగతి మన్నించి యిట్లనియె. ౧౦౭

క॥ ఏమిది? మీరలు శంకర,తామరసోద్భవులతోడఁ దరలి ననుఁ గనఁ
బ్రేమించి వచ్చితి రనన్, దామోదరుతోడఁ బలుకఁ దలఁపఁ డొక
రుఁడున్. ౧౦౮

వ॥ అట్లు చింతాదంతురులై ప్రత్యుత్తరం బొసంగ నేరనిసురలకు
జగన్నాథుండు గరుణార్ద్రుండై యిట్లను. ౧౦౯

గీ॥ చెప్పుఁడీ మీకు వచ్చినసేగి యెట్టి, దైత్య నర్దానికి నొనర్తు యత్న
మనుడు, సురలు ముకుళితకరు లయి హరికి ననిరి, నీవ యెఱుఁగుదు
వన్నియు దేవదేవ. ౧౧౦

గీ॥ వామనాకారమున బలి బద్ధుఁ జేసి, యింద్రుని సురాధిపతిఁ జేసి యె
ల్లలోక, ములును ద్రిపదమ్ములుగఁ జేసి మున్ను మమ్ముఁ, గాచితివి
దైత్యులెల్లరు కలఁక చెంద. ౧౧౧

వ॥ తదవహ్నాతం బగునమృతమ్ము మరలం గొని సుఖవర్తనులమై
నాఁటనుండి నాకమ్మున నుంటి మనునంతి విష్ణు విట్లను. ౧౧౨

గీ॥ తెలిసికొంటిని మీదగుకలఁక తెఱగు,వాఁడు దెగునదుపాయంబు వం
చనాది, కముల యోజించి మీకు హితము నొనర్తు, నెట్లయిన దుష్టు
ల హరించుటే వ్రతంబు. ౧౧౩

వ॥ యోగ్యులయెడలనైన సామాద్యుపాయమ్ములు ప్రయోజ్యం
బులగుచుండ నయోగ్యులకు నివి యనర్హంబు లెట్లగు నీవృత్రుండు

బ్రిహ్మాదత్త్వవరదర్పితుం డగుకతన సర్వభూతావధ్యుండై నిరంకుశమ్ముగ
వర్తించుచున్నవాఁడు. ౧౧౪

క॥ సామోపాయమ్మున మన మీ, మానవభక్షకుని జయింప వలయు లే
దా? మనకీతఁ డవధ్యుఁడు, సామాన్యుఁడె వృత్రుఁ డన నసాధ్యుఁడు
కాఁడే. ౧౧౩

వ॥ కావున నెల్లన నితనితోఁ గపటమైత్రి నొనర్చి విశ్వాస్యమ్ము
లగుశపథమ్ములం జేసికొని పిదపఁ బరిమార్పవలయు. ౧౧౬

గీ॥ చనుఁడు గంధర్వులార! వంచన యెలర్ప, నాతనికి నింద్రునకు మైత్రి
యలవరింపుఁ, డేను బవిమధ్యమునుండి యేరికిని న,గోచరుఁడ నయి
సాహాయ్య మాచరింతు. ౧౧౭

క॥ ఏకపటంబొనరించిన, నాకుటిలుఁడు మైత్రి కొప్పు నయ్యాది మీరల్
గై కొనుఁడు కపటకృత్యము, కాక కుటిలహరణమునకు గతి వేఱున్నే.

వ॥ మీర లెవ్విధమ్మునైనఁ బాప మనక విశ్వస్తుం గావించు
నది పిమ్మట మతిసాహాయ్యమ్మున శక్రుఁ డద్దురాత్ము వధియించుఁ బాపా
త్ములయెడ నధర్మవర్తనంబుకతన దోషంబుగలుగ దని చెప్పి మఱియును.

ఉ॥ వామనరూపమంది బలి వంచనచేసితి దైత్యులన్ వృథా
కాముల మోహినీత్వమునఁ గాదె ప్రతారితులం బొనర్చితి
న్నేమముగా వధింప నగునే? రిపు దుస్సహ తేజు బుద్ధి వి
ద్యామహిమమ్మునన్ దగినయట్టియుపాయము పూనకుండినన్. ౧౨౦

వ॥ ఇది యిట్లుండ సర్వకామప్రదాత్రి యగుజగజ్జననిం బ్రార్థిం
చిన నాపె యోగమాయాస్వరూపమ్మున సాహాయ్యకం బాచరించుఁ
దన్మాయాబద్ధుండై వృత్రుం డింద్రునకు వధ్యుం డగు నని వెండియు.

ఆ॥ వె॥ ఆపెకరుణగల్గ నఖిలకామమ్ములు, సిద్ధిచెందు నెరుసు చేసెనేనిఁ
గలుగ దేరికేనిఁ గార్యసాఫల్యంబు, గొలువుఁ డంబికను నకుంఠభక్తి.

క॥ మును మధుకైటభవధకై, జనని న్నుతియించి యాకెసాహాయ్యమ్ముం
గొని గాదె వధించితి మీ, రును నయ్యంబన్ భజించి గ్రుంపుఁడు
వృత్రున్. ౧౨౩

వ॥ అని విష్ణువు బోధింప సుర లందఱును మందారద్రుమకుసుమమండిత
మ్మగుమేరునగరమ్మున కరిగి ధ్యానపరాయణులై యయ్యంబ నిటు సన్ను
తించిరి. ౧౨౪

గీ॥ దేవి? వృత్రునిబాధచే దీనులైన, దేవతలఁబ్రోవఁగదవమ్మ? దిక్కు
లేక, నీకుశరణంటిమమ్మ? మన్నింపుమమ్మ?,పుత్రుల ననాదరించుట
పోలునమ్మ. ౧౨౫

గీ॥ నీదుభ్రూభంగ వశమున నిలిచిహరియు, హరుఁడును విరించియును
గృతులాచరింతురు,నిన్ను మించినదైవ మెందేనిఁ గలదె, శరణమొం
దిన దివిజుల నరయుమమ్మ. ౧౨౬

ఉ॥ ఇమ్ముగ మత్పదమ్ము భజియించి మహావిభవమ్మునొంది దా
నమ్మద మెక్కి నాదుభజనమ్ము ద్యజించినమీరు మత్కటా
క్షమ్మున కెట్లు పాత్రులనఁగాఁ దగదమ్మ?త్వదీయమాయయే
మమ్మిటు చేసె లేకునికి మత్తత మా కెటు లబ్బు శాంకరీ? ౧౨౭

క॥ నము బాధించుచు మున్ను గ్రి, మము దప్పి చరించునట్టిమహిషా
సురునిన్, జముబారి కనిచి యేలితి, వి మహేశ్వరి? యెంత నీకు
వృత్రుం డనినన్. ౧౨౮

క॥ శుంభున్ దదనుజుఁ డైనని,శుంభున్ దదనుచరులన్ విసువ కవలీలన్
గాంభీర్య మెసఁగఁ జంపవె,శాంభవి?వృత్రుండు నీ కసాధ్యుండగునే.

ఆ॥ వె॥ అంబ? పీ వనాదరం బొనర్చితివేని, దైత్యుకతన దీనదశకు వచ్చి
నట్టిసురలఁ గరుణ నరసి స్వశక్తిచేఁ, గాచువాఁ డొకండు గలఁడె
యెందు. ౧౩౦

ఆ॥ వె॥ కరుణ యగ్గలమ్ముగా వృత్రునందు నీ కలరుఁగాక, దుష్టుఁ డైన

కతన, శస్త్రిహతులఁ జేసి జనని పవిత్రిత, గూర్చుఫోంటె వీనిఁ
గూల్చుమమ్మ? ౧౩౧

గీ॥ వెనుక రణరంగమున నీదువిశిఖపాత, ములను జెందియు వృత్రుని
బలముకలిమి, దైత్యు లసురవనంబు నుద్ధవిడఁ గొనిరి, నీదుభయ
మేని వారు మన్నింప రొక్కొ. ౧౩౨

క॥ వృత్రుఁడు నీకును మిగులన్, శత్రుఁడ భక్తుండయేని జననీ! త్రిజగతీ
నేత్రి! మను నీదుభక్తికిఁ, బాత్రుల నిష్పాటబాధపా ల్సేయునొకో.

క॥ నినుఁ బూజింపఁగ లేదని, యనుకొనకుముపూలు మేనునఖిలను నీచే
తనకాదె యుద్భవించుట,ప్రణతుల మమ్మేలుమమ్మ భవభయహంత్రీ

క॥ వారలు ధన్యులు నినుమె, న్నారు భవాంభోధిపోతవైఖరిఁ దగి ము
న్నారాధిత మసుత్వోత్పద, నీరేజాతమ్ము గొల్చి నెగడుదురో వెసన్.

గీ॥ యాజ్ఞికులు వేదవిదులు స్వాహాస్వధాస్వ,హావముల నొప్పుని న్నెం
తురి రూఢి మెఱుగు,హోమకాలమ్ములందునీ యోగమునన, సురలుఁ
బితరులు ముక్తిని బొరయు టెటులఁగి. ౧౩౬

ఆ॥ వె॥ తల్లి మేధ వీవ దయవీవ శాంతివి, నీవ కాంతి వీవ నిఖిల మీావ
సకల మీావునర్చిసద్భక్తులకునను,గ్రిహముకల్మి నీఁగఁగడఁగుచుందు.

చ॥ అని సురలెల్లఁ దన్నుఁ గొనియాటకు మెచ్చి విభూషితాంగియున్
ద్రిణయనయున్ జతుర్భుజయు దివ్యతరాయుధయున్ సురక్తచం
దనవసనాఢ్యయున్ గుసుమదామసమంచితయున్ బ్రిసాదశో
భినియును నై పరాంబ మృదువేషిణి దాఁ బొడకట్టె వారికిన్.

గీ॥ సర్వవేదాంతరూప యజ్జనని ప్రణతు,లైనసురలకు నిట్లను నమరు
లార?, యేమి కార్యమ్ము గల్గె మీా కెల్లరకును, సుఖముకద? వచ్చు
టేమి నన్ జూచుపొంటె. ౧౩౯

వ॥ నావుడు దేవత లిట్లనిరి.

శా॥ అంబా? వృత్రుని బాధ కోర్వఁ దర మానా? వాని నెల్లైన వే
గం బాలోకము చేర్చి మమ్ము సుఖులం గావింపు మారీతి శం

కం బాటింపక విశ్వసించి హితులం గాఁ జూచి మాతోడ మై
త్రిం బూనుట సురవైరి యట్టివిధ మేదేనొండు గల్పింపుమా.

క॥ ఏబలమున వృత్రుఁడు మా, చేఁ బడుఁ దత్తాదృశంపుఁ జేవ గొలిపి బల్
ప్రాబల్య మాయుధములకు, రాఁ బాటింపఁ దగదే యరాతినిహంత్రీ.

వ॥ అనవుడు జగదంబ యంగీకరించి యంతర్ధానంబు నందె సు
రలును సంతుష్టాంతరంగులై ఋషిసహితమ్ముగా నరిగి త్రిలోకమ్ముల నద
లించువడువునఁ దమ్ము నందఱ మిం గుభంగిఁ దీక్ష్ణతేజమ్మునం బొల్చు
వృత్రుం గని సామార్థంబు మునుల నతనియొడకుం బనిచినఁ జని వార
లిట్లనిరి. ౧౪౨

మునులు వృత్రవాసవులకు మైత్రి గొలుపుట.

ఉ॥ వృత్ర ! త్రిలోకభీతికరవిక్రమ ! శక్రముఖాసురావళీ
జైత్ర ! యజాండమెల్లను వశం బయి యొప్పెను నీకు! యోగ్యతా
పాత్రుఁడ వీవు శక్రుఁడును బండితమాన్యచరిత్రుఁ డిర్వురున్
మైత్రి నెసంగినన్ భయము మాను జగమ్ముల కింత యొప్పదే. ౧౪౩

ఆ॥ వె॥ కు నిదుర లేదు నిర్జరపతిభీతిఁ, జేసి నీదుభీతిఁ జేసి యింద్రు
నకుసుఖమ్ము లేదనారతమును మీదు, సంగరమ్ము లోకసంకటంబు.

సీ॥ యుద్ధమొనర్పెడియోధుల కింతయు సుఖము గల్గదు దీని శూరవ
రులు, మెచ్చికొందురు గాని మేటిగ శృంగారభావజ్ఞు లగుమహా పం
డితులు ర, ణమ్మునఁ బెక్కుదోషమ్ములు నొడువుదు రాయాస మవన
రమందు స్నాన, పానమ్ముల్లేమియు భార్యాసుఖవియుక్తి యింద్రి
యార్థగ్లాని యిది యిటుండ॥ గీ॥ జయము దైవానుకూలత జరుగుఁ
బూల, చెండ్లతో నైన యుద్ధంబు చేటున కగు, ననిన శితశరముల
బాధ లడుగ వలెనె, సంస్మృతిసుఖాపహరణంబు సంగరంబు. ౧౪౪

చ॥ అనిమొనఁ జచ్చువారలకు నబ్బుఁ దుదిన్ ద్రిదివం బటందు శ
స్త్రనిహతి నొచ్చి నేలఁ బడి తాపము చెందుచు నక్క లంగముం

దినఁ గనువారు లేక కడుదీనతఁ జచ్చినమీఁద స్వర్గమో
క్షనికిఁ బ్రియంబె? పేరణకుఁ గా కిదినిక్షపుధర్మవాక్యమే. ౧౪౬

ఆ॥ వె॥ నీకు నింద్రుతోడ నీతోడ నింద్రున, కెలమి సఖ్య మింక నెనఁ
గుఁగాక,దాన మీకు సుఖ మొదవు యక్షగంధర్వ,కిన్నరాదులకును
గీడు దొలఁగు. ౧౪౭

చ॥ శపథములర్ల బొనర్చి దివిజప్రభుఁ డిప్పుడ నీదుచెల్మి ని
ష్కపటముగా నొనర్చు నటు కైకొను మీవును; మధ్యవర్తులై
తపసులు గూర్చువారఁట? ప్రతారణ మిం దొడఁగూడు టెట్లు? స
త్యపరతఁజేసి కాదె జగమంతయు నిల్చుట యెన్నిభంగులర్. ౧౪౮

చ॥ ధరణి భరించు నత్తరఁణి దాఁ దపియించు సుఖప్రచారియై
కరువలి వీచు సంద్రములు కట్టునకుం జవదాఁట కుండు స
త్యరతిన కాదె మీరలు యథార్థ పరత్వము నంది మైత్రి ని
ర్వ్యరును సుఖమ్ములం గొనఁగఁ బోలదె మాను లసత్యవాదులే.

వ॥ కావున మీరలు బద్ధసఖ్యులరై శయనాసనక్రీడాదికమ్ముల నొక్కెడన సలుపుచు వర్తించునది నావుడు వృత్రుండు మునులం గాంచి మీర లవశ్యమ్మును నాకు మాననీయుల రెల్లభంగులను మీ మాట పాటింపం దగు నైనను శత్రువునందును శపనియందును గాముకునందును నిర్లజ్జునందును విశ్వసింపఁ దగదు గాన నింద్రుండు పాపాత్ముండును బ్రహ్మఘ్నుండును నగుట నా కవిశ్వాస్యుండు నావుడు మునులు మరల నిట్లనిరి. ౧౫౦

గీ॥ ఎవఁ డొనర్చినద్రోహంబు నెవఁడు గుడుచు, బ్రహ్మహత్యయుఁ గలు
దావ్రుపాతకంబు, నిష్కృతిం బోవ నేర్చు నెందేని మిత్ర, ఘాతు
తుకుని పాతకమునకుఁ గలదె శాస్తి. ౧౫౧

వ॥ అట్లగుట మిత్రద్రోహంబొనర్చి యతఁ డెందుఁ బోయెడి నీ యభిమతం బగుశపథమ్మున కతం డియ్యకొను నయ్యది మా కెఱిం గించి యింద్రునకు మైత్రి నొసంగుము నావుడు వృత్రుం డిట్లను. ౧౫౨

గీ॥ ఆర్ద్రమునఁ బొడిమునఁగాని యశ్మమునను, గాని దారువుచేఁగాని
కఠినవజ్రవిహతిచేఁగాని పగటఁగాని నిశిగాని, ననుసురలుఁ దత్ప్రతతియుఁ జంపఁ జనదు వినుఁడు. ౧౫౩

వ॥ ఇందులకు సమ్మతంబు జేసి మీచెప్పినచొప్పున నొసర్తు ననుడు మునులు సురపతి కాచందం బెఱింగించిన నతండు వల్లె యని యతనికడకు వచ్చి. ౧౫౪

గీ॥ అగ్నిసాక్షిగ మునులెల్ల నరయుచుండ, నొప్పితిని నీదుపల్కులకు
భయులమును, మిత్రులమటంచుఁ బల్కు నావృత్రుఁ డతని, మాటలకు విశ్వసించుచు మైత్రి నొలిపె. ౧౫౫

క॥ వారలు మిత్రు లవంధగు, వారలు సహచర్య సలుపువార లుదధిరా
డ్తీరమ్మున నందనమునఁ, గూరిమిఁ జరియింతు రిచ్చ నొలిపినయెడలన్

వ॥ ఇట్లిరువురకు మైత్రి గలుగుటకు వృత్రుండు సంతసించె నింద్రుండు తద్వధోపాయమ్ము చింతించుచు రంధ్రాన్వేషణతత్పరుండై యుండె నిట్లు గొంతకాలమ్ము గతించె. ౧౫౬

గీ॥ తనకుమారుండు వృత్రుండు దనుజవైరి, యైనయింద్రునితో మైత్రి
నాచరించె, ననుచుఁ ద్వష్టప్రజాపతి యనికి కతన, వృత్రుకడ కేగు
దెంచె నివ్వెఱఁగు గదుర. ౧౫౭

వ॥ వచ్చి మంతనమ్మునఁ గొడుకున కిట్లనియె.

చ॥ అరి పరదారలంపటుఁ డహంకృతిశాలి పరప్రతారకుం
డరయుచునుండు రంధ్రముల నన్యులసేగికి సంతసించు దు
ర్భరమగు మాతృగర్భమును భంగము సేయఁడె లోనఁజొచ్చి నీ
తిరహితుఁ బాకశాసను మదిం గన క్షేమని విశ్వసించెదో. ౧౫౯

గీ॥ అంచులును మనయట్టిరే యనఁగరాదు, విశ్వసింతురె వైరుల వెఱ్ఱు
లైన, సందు దొరకినయేని విశ్వాసఘాతు, కుం డితఁ డధర్మవర్తి
గాకుండు బెట్లు. ౧౬౦

వ॥ ఇట్లు నానావిధముల బోధించిన నాసన్నమరణుండగుకతన వృత్రుఁడప్పలుకులు చెవిఁబెట్టఁడంత నొకనాఁడు సముద్రతీరమ్మున నిరువురుం జరించుచుండ సంధ్యాకాలమ్ము సంప్రాప్తంబగుడు నియ్యది రాత్రి గాని పగలు గాని కాకుంట నిప్పుడ వధించుట పోలు నదియు నుంగాక యేకాకియై యున్నవాఁడని యెంచి యింద్రుండు హరిం దలంచిన. ౧౬౧

## వృత్రుండు చచ్చుట.

గీ॥ అరుగుదెంచి యగోచరుఁడై పవిం బ్రవిష్టుఁడై యుండెనంత దివిజ
పతియుఁ ద, నమది నేలీల వీని వినాశ మంచుఁ, జింత నొనువాఁడు
ఫేనమ్ముఁ జెంతఁ గాంచె. ౧౬౨

వ॥ సముద్రమ్మునఁ బర్వతోపమమ్ముగాఁ బెచ్చుపెరుఁగునురుఁగుం జూచి యిదిశుష్కమ్మును నార్ద్రమ్మునుం దక్కుంగలశస్త్రమ్ములును గానేర దని నిశ్చయించి దేవిం దలంచుకొని యద్దానిం గ్రహించునాలో నాపెయుఁ దనయంశమ్మందు నిమిడ్చె. ౧౬౩

క॥ హరిసంయుత మగువజ్రము, హరిహయుఁడు నురువునఁ బొదివి య
సురపయి మహోగ్ధురగతిఁ బఱపిన వృత్రుఁడు, గిరినాఁ బడె దాని
హతికిఁ గీటడఁగి నృపా. ౧౬౪

వ॥ ఇట్లింద్రుండు విగతశత్రుండై మునులు సన్నుతింప నమరావతి కరిగి శోకహారిణి యగునజ్జగదంబ కుత్సవం బొనరించి పూజించి దేవ్యుద్యానమ్మున నొకప్రాసాదమ్ము నవరత్నకుట్టితంబుగ నొనర్చి పద్మరాగమయ మ్మగుదేవీవిగ్రహంబు నిర్మించి యందుం బ్రతిష్ఠించె.

క॥ అలరెడువేడుక నదియు మొ,దలుగఁ ద్రికాలములయందుఁ దద్దయుఁ
బేర్మిఁ, గొలుతురు సురలాయంబ, గులదైవతముగ నొనర్చి కు
వలయనాథా. ౧౬౬

క॥ "అరి యగువృత్రాసురునిన్, హరియించెన్ బవినిడాఁగి హరి,, యని హరి యూ, హరిఁబూజ చేసె నానం, దరసాబ్ధి మునుంగు వేల్పుతంం డమ్ముఁతోన్. ౧౬౭

గీ॥ దేవియును హరియును హరి తవిరి ముగురు, వృత్రు నడఁచిరి శ్రీ దేవి వృత్రహంత్రి, యయ్యె నకార్యణమ్మున; నమరపతి ప్రథా నుఁ డగుఁ గానఁ గీర్తి యతనికి వచ్చె, ౧౬౮

వ॥ పదంపడి విష్ణుండు దనపురమ్మున కరిగె నింద్రుండును మిత్రద్రోహభయమ్మున దందడిఁ గొనుచు నొకభంగి నుండె మును లీద్రోహంబు తమకితనఁ గలుగుటం జేసి పాపభయత్రస్తులై॥ ౧౬౯

గీ॥ అకట ! విశ్వాసఘాతుకుం డైనయిందు, సంగతిం జేసి మనము వి శ్వాసఘాతు,కులమ మునిశబ్దమునకుఁ బంకిలతగలిగె,హరియు మన యట్టిఁడాయె నే మనఁగవచ్చు. ౧౭౦

వ॥ మంత్రికృత్తును బుద్ధిదాతయుఁ బ్రేరకుండును బక్షకర్తయు నను వీరలు పాపకార్యులతో సమఫలభాక్కు లని చెప్పం బడుదురు.

గీ॥ అలరు నాల్గు పదార్థమ్ము లందు నాది, యంతము నశించి నడిమిరెం డలరుచుండె, ధర్మమనుమాట కేవలదంభ మకట,యెంతమహానీయు లందేని యింతె నిజము. ౧౭౧

గీ॥ హరి హరినిఁగూడి పాపకృత్యంబటంచుఁ, దలర కీద్రోహ మొనరింపఁ దగునె యెఱిఁగి, వంచనఘటించు టేరికి మంచిపనియె, యరయ రవి వేకమును స్వార్థ మరయువారు. ౧౭౩

వ॥ ఇట్లు పశ్చాత్తప్తులై మునులు తమతమ యాశ్రమమ్ముల కరిగిరి పిదప వృత్రునిమృతికిఁ ద్వష్ట శోకించి యతని కుత్తరక్రియలు నిర్వర్తించి సురపతి వంచనం జేసి మత్పుత్రుకు హరించెఁ గావున దుఃఖ మొందెడి నని శపియించి మేరుశిఖరమ్మునకుఁ దపమ్మున కరిగె నావుడు జనమేజయుం డిట్లనియె. ౧౭౪

క॥ తాతా! యింద్రుం డీగతిఁ, బాతకకృత్యం బొనర్చి పరిబలేనొ దుఃఖా
స్వీతుఁ డయి వన్నె దఱిఁగెనొ, చేతము రంజిల్ల నాకుఁ జెప్పం గదవే.

వ॥ నావుడు వ్యాసుం డిట్లనియె.

గీ॥ చెప్ప నేటికిఁ దా నెంత శ్రేష్ఠుఁడైనఁ, గృతశుభాశుభకర్మముల్ గెం
టఁగలఁడె, కొంచెమో గొప్పయో తాము గొలుపుకర్మ, మనుభ
వింతురు మనుజులు నమరవరులు. ౧౨౬

గీ॥ శక్రునకు నిట్టిదుర్బుద్ధి సంతరించి, హరి సహాయము చేసె; మున్నా
ర్తివేళఁ, దా నెచటి కేగె సమయమ్ము దప్పులునపుడు, స్వజను లంద
ఱు సంసారసరణి యిదియ. ౧౨౭

ఉ॥ దైవబలమ్ము లేనితఱిఁ దల్లియుఁ దండ్రియు భార్యయుఁ సుతుల్
సేవకులున్ సహోదరులు స్నేహితు లొడ్డు నొకించుకేని సం
భావన చేయ రాఫలము పొల్పడుఁ గర్తకు, వృత్రుఁ జంపి య
ద్దేవవిభుం డొకండ తన తేజము గోల్పడె నెన్నిభంగులన్. ౧౨౮

వ॥ తక్కుంగల దేవత లందఱును నింద్రునిఁ గృతఘ్నుం డని
గేలి చేసి నిందింపం జొచ్చిరి. ౧౨౯

మ॥ ప్రతినం జేసి యథార్థతత్పరత విశ్వాసమ్ము గైకొన్న స్నే
హితు నెవ్వాఁడు వధించు నింద్రుఁ డిటుదుష్కృత్యమ్ము చేసెన్ బ్రమా
ణత వేదమ్ముల నుజ్జగించి మునులన్ దా దవ్వులన్ డించి సా
గతసిద్ధాంతము పూనునే? తనకు వేడ్కల్ సేయునే యీకృతుల్.

ఆ॥ వె॥ హరికిఁ దక్క నొక్క హరిహయునికిఁ దక్కఁ, గపటకృత్య మిట్లు
గడలుకొల్పి, వృత్రుఁ జంపఁ గల్గు మేటి జగమ్ములఁ, గానరాఁ డటంచుఁ
గథలు బలిసె. ౧౩౧

క॥ నరపాల! దేనికతమున, నసులునుఁ దనుఁ గాంచి నగుదు రట్టియప
యశే, స్ఫురణం బింద్రునిమానము, హరియించె నపయశ మెంత
కైనం జాలున్. ౧౩౨

సీ॥ కీర్తిక్షయమ్మునఁ గెరలి యింద్రద్యుమ్నుఁ డఘ మెఱుఁగకయును
నాక మెడలె, స్వల్పాపరాధి యయాతియుఁ బతితుఁడై కర్కట
త్వమ్మునఁ గాంచెఁ బదియు, నెనిమిదియుగములు; భృగుపత్నిఁ దలఁ
ద్రెళ్ల నేసినహరియుఁ బెంపేది తుచ్ఛ, యోనులఁ బడె మఱియును
నామనుండయి తిరిప మెత్తుకొనె నెందేని యొండు॥ గీ॥ కలదె యిం
తకుఁ గష్ట మక్కట ? దశరథ, రాముఁడై భార్య వీడి దుఃఖామయ
మునఁ, గ్రుంగెఁ బృత్రాసురునిఁబొరిగొనినకతన, నిగ్రదుఁడును బ్ర
హ్మహత్యఁ బెంపేదె నిపుడు. ౧౮౩

వ॥ అట్లు తేజోహీనుండై కొలు వుండక యేకాంతమ్మునఁ జిం
తించుతనపతికిఁ బౌలోమి యిట్లను. ౧౮౪

గీ॥ రిపునిఁ బ్రబలుని వృత్రుఁ బరిమార్చి తింక, వంత గొననేల? సుఖములఁ
బడయకున్న, కారణం బేమి? మఱియు నెక్కరుఁడు రిపుఁడు, ప్రబ
లుఁ డెందును లేఁడుగా! భయము గొనఁగ. ౧౮౫

గీ॥ అనుడు శచి కిట్టులను హరి వనజనయన, శత్రుఁడును లేఁడు సుఖము
ను శాంతిలేదు, బ్రహ్మహత్యాభయమ్మున బడలుచుంటి, నిట్టి నా కిం
క నిశ్చింత యెట్లు గలుగు. ౧౮౬

వ॥ అని వెండియు.

గీ॥ నందనవనమ్ము సుధయు గంధర్వగాన, మచ్చరలనృత్యములు నీవు
నన్యయువతి, చేష్టలును గామధేనువు శ్రీ నొసంగు, కల్పవృక్షమ్ము
నాకు సుఖమ్ము నిడవు ౧౮౭

వ॥ అని చింతావిష్టుండై మానససరోవరమ్మున కరిగి భయంబు
పెంపునఁ బద్మనాళమ్ముం బ్రవేశించి ప్రచ్ఛన్నుండై పరాభూతుండ
గుకతన నేరికిం గనుపడక నీటిపాముచందమ్మున నజ్ఞానమ్మునఁ జరించుచుం
డె సురలును దమపతిం గానక శోకకర్శితు లైరి మఱియును. ౧౮౮

గీ॥ జగ మరాజక మయ్యె వర్షములు దక్కెఁ, బాఁడిపంటలు నశియించెఁ
బ్రబలమైన నదులు కృశియించె వృక్షముల్ నవక మెడలె, రాజు

లేకున్న నొక్కటి రాణ గనునె. ౧౮౯

వ॥ అంత మునులును సురలును యోజించి నహుషునిఁ దమకుఁ బతిగా నొనర్చికొని సుఖ మ్ముండిరి. ౧౯౦

## నహుషుండు స్వర్గమ్ము నేలుట.

గీ॥ ధర్మమతియయ్యు నహుషుఁ డత్తఱిని రాజ్య, మత్తుఁడై యచ్చరలఁ
గూడి చిత్తజాత, కేళులం దేలి సౌఖ్యముఁ గిం వదంతి, గా వినియె
నింద్రుభార్య చక్కఁదనంబు. ౧౯౧

వ॥ విని తద్గతహృదయుండై యొక్కెడ ఋషులం గాంచి యిట్లను.

గీ॥ దేవపతి నైతిఁ గద? యేను దివికి నాదు, సేవ కింద్రాణిరా దేల? చెచ్చ
ర సుర, వరుల నంపించి పిల్పింప వలయు నిపుడ, హితము నా కిచ్చ
గింతురయేని మీరు. ౧౯౨

వ॥ అనవుడు దేవర్షులును దేవతలును జింతాక్రాంతులై శచి కడకుం జని వినమ్రులై యిట్లనిరి. ౧౯౩

క॥ వినుమమ్మ? నహుషు నమరుల, కినుఁగా నొనరించికొంటి మే; మాతఁ
డు నిన్, దనమనమునఁ గామించెన్, ‘‘గొని రం,,డనెనెదురుచెప్పఁ
గోపించు నికన్. ౧౯౪

వ॥ నావుడు శచి చింతించి బృహస్పతిం గాంచి మహాత్మా? నహుషునికతన భయంపడి నిన్ను శరణంబు సొచ్చితిఁ గాపాడు,, మనవుడు నతం డభయం బొసంగి యిట్లనియె ౧౯౫

ఉ॥ కేవలకామమోహితుఁ డకించనుఁ డున్నదుఁ డట్టివానికై
దేవి? మహాపతివ్రత నధీనగ ని న్నొనరింతునే? భయం
బీవు త్యజింపు మిన్నిటికి నేఁ గలుగన్ నహుషుండు దుష్టుఁ డిం
కేవిధి నిన్నుఁ బొందు? నుద మెక్కెనె రాజ్యముకల్మి వానికిన్.

వ॥ పదంపడి యింద్రాణి బృహస్పతి శరణంబు చెందె నని విని నహుషుండు కోపించి సురలం గాంచి ౧౯౬

క॥ సురలారా! చంప వలెన, గ్గురునిన్ దుష్టాత్ము నాదుకోరిక యు వృథా
గ రచించు నె? నావుడుముని,వరులుసురలు గలిసియిట్లువలికిరికడఁకన్.

క॥ కోపము విడువుము దేవా,పాపమునన్ బుద్ధి చొనుపఁ బాడియె? వినలే
దా? పరదారాగమనం,బాపదలకుఁదా వధర్మ్య మనియునుశ్రుతులన్.

ఆ॥ వె॥ శక్రుపత్ని మిగుల సాధ్వి మహాభాగ,తనదుభర్త జీవితగతినుండ
నిన్నుఁ బొందు టెట్లు నీవు త్రిలోక వి, భుండ వయ్యు ధర్మము వి
డఁ దగునె. ౨౦౦

గీ॥ రాజు ధర్మమ్ము విడిచినఁ బ్రిజలధర్మ,వర్తనులు గారె శాస్త్రిముల్
వమ్ము గావె, శచికిఁ దల దాఁటఁ గల్గినచక్కఁదనము, గల్గువేశ్యలు
లేరె నీకామమునకు. ౨౦౧

క॥ రతి శృంగారమ్మునకున్, గతి రతి యున భోగకాంక్ష కాంతకుఁ బతికిన్
మతిగల్గినరసముబలా,త్కృతియైన విరసము దానినెనయరు రసికుల్

గీ॥ ఉత్తమపదంబు గైకొని యున్ననీకు,బాపములకెల్ల యగులాఁతిపడఁ
తిపొందు, తగద యాయుఃక్షయం బగు దానికతన, గలుగు నధమా
ధమ మ్మగుగతి నరేంద్ర!. ౨౦౩

ఉ॥ నా నహుషుండు పల్కుఁ బరనాగులఁ బొందఁగ రాదె? గౌతమ
స్త్రీని నెటు పొందె నిందుఁడు? హరించెఁగదా?గురుభార్యఁజంద్రుఁ
డ ప్డీనియమమ్ములం బలుకు నెల్లరు మీరెటఁబోతి? రొడ్లకున్
దా నెటు పల్కు నప్పగిదిఁదానయి చేయఁగఁ జాలఁ డొక్కఁడున్.

క॥ మతినొప్పక యున్నబలా, త్కృతినై నందెందు పొందు దేవపతిసతిన్
బ్రితిచెప్పకుఁ డిట్లయినన్, హితమగు నిరువురకు సుఖములెసఁగుఁ
గ్రిమమునన్. ౨౦౫

వ॥ ఇట్లు మదనాతురుం డగునన్నహుషునికి మాఱాడ నోడి
మంచి దని వారలు బృహస్పతిపాలికిం జని కృతాంజలులై యిట్లనిరి.

క॥ అనఘా! నిను శరణుఁ జెందిన,దని యెఱుఁగుదుమైన నీపెనాతనికడకున్
గొనిపోవలె నిందుని,గా,నొనరించితదాజ్ఞ దాఁటుటొప్పునెమనకున్

ఆ॥ వె॥ ఇందుఁ డైనయతని కెల్ల రయట్ల యి, తగ్గరుణి ధనమ కానఁ ద
నకుఁ దాన, యగుచు వలచెనేని యది సరసంబగు,నట్లొనర్పఁ జేయు
మయ్య నీవు.                                                    ౨౦౫

ఆ॥ వె॥ అనుడు గురుఁడు పల్కు నతిపతివ్రత నన్ను, శరణుఁ జెందె.నిట్టి
సతినివిడిచి, పాప మంద నాకుఁ బాడియె శరణాగ, తుల విడుచుట
కన్న దోసమున్నె.                                                ౨౦౬

క॥ అనవుడు దేవత లిట్లని, రనఘా! యేదేని నొకయుపాయమ్మున నా
తనికోప మడఁపఁగావలె, నన గురుఁడిట్లనియె దేవతావళితోడన్.

వ॥ ఇట్లని యీామె యతనిసన్నిధికి వచ్చి యొకసమయం బొన
ర్చు॥ నాపతి మృతుం డయ్యె నని తెలిసినయపుడ నిన్ను వరింపం గల
దాన నట్లు కాని నాఁడు జీవద్భర్తృక నగునే ని న్నెట్లువరియింతుఁ గా
వున మత్పతి నన్వేషించుపొంటెఁ జనియెద నని యీాగతి నతని వంచిం
చి నాయనుమతి నింద్రాన్వేషణమ్మునకుం గడఁగు ననుడు బృహస్పతి
పురోగములై దేవత లందఱు నహుషునికడ కరిగిన నాకృతిమవాస
వుండు వారిం గని సంతసించుచు శచి నుద్దేశించి యిట్లనియె.    ౨౦౭

క॥ తక్కు సురలెల్ల నన్ను, న్మక్కువ నాథునిఁగఁజూచి మన్నింతురు నీ
విక్కృతికి సమ్మతించిన, నిక్కపువాసవుఁడ నగుదు నీరజనయనా.

ఉ॥ నావుడుఁ గంప మంది లలనామణి యిట్లని పల్కు లజ్జమై
దేవ! సురేంద్ర! మత్పతిగతిం గనరామిఁ గృశించి యుంటి స
ద్భావ మభావముం దెలియ వచ్చెడిదక్కను దాళుమయ్య నా
కీపర మిమ్మనంగ నతఁ డియ్యకొనెన్ విడిచెన్ శచీసతిన్.     ౨౦౩

వ॥ ఇట్లతనిచే విడువం బడి యాపె సురలం గాంచి యిట్లను
మీారందఱును నా దాజ్ఞంజేసి పత్యన్వే పూర్వకమ్ముగ నింద్రునిగతి న
న్వేషింపుఁ డనవుడు వారలందఱు నొక్కెడఁ గూడి యోజించి విష్ణు
లోకమ్మునకుం జని యతని సన్నుతించి యిట్లనిరి.              ౨౧౪

ఆ॥ వె॥ దేవ! బ్రహ్మహత్యఁ దేజమ్మునకుఁ జెడి, యెల్ల భూతముల కదృ
శ్యుఁ డగుచు, నేడనో యడంగె నిందుఁ డాతనికి మా, కును మహో
త్తమ! గతి వగుము కడంగి. ౨౧౬

క॥ నీయానతిఁ గొని మా యో, పాయమ్మున వృత్రుఁ జంపి బ్రహ్మఘ్నుండై
యేమెడడాఁగెనో సురపతి, పాయక కనఁ జేసి మమ్ముఁ బాలింపు హరీ

వ॥ నావుడు విష్ణుండు హయమేధం బొనర్చితిరేనిఁ దత్పుణ్యమ్మునఁ బావితుండై యిందుఁడు మీకుం బతి యగు. ౨౧౭

గీ॥ అశ్వమేధమ్ముచే జగదంబ ప్రీతి, నంది హరియించు బ్రహ్మహత్యాద్య
ఘముల, శచియుఁ బరశక్తి పూజలు సలుపుఁగాక, లబ్ధభర్తృక యగు
పొందు లలితగతుల. ౨౧౮

వ॥ నహుషుండును మాయామోహితుండై స్వయంకృతాపరాధమ్మున నైశమ పదభ్రష్టుం డగుఁ బోం డనినసురలు బృహస్పతిసమేతమ్ముగా నతనిచెప్పినచొప్పున నరయుచు నిందుఁ డున్నెడ కరిగి వానిం గాంచి హయమేధం బొనర్పఁ జేసిన నంతఁ బావితుండై యతండు బ్రహ్మహత్యాపాతకమ్మును విభజించి నదులయందును వృక్షమ్ములయందును స్త్రీలయందును బృథివియందును గిరులందును జొనిపి సమయమ్ము నరయుచుఁ దజ్జలమ్మునన వసింపుచుండె నంత దేవతలును దమతమపొందు పట్ల కరిగిరి పిదప నొక్కనాఁడు. ౨౧౯

క॥ విరహాకుల యయి శచి య, గ్గురువరుతోఁ బల్కె నేలొకో రాఁడు
సురేశ్వరుఁడు హయమేధ మొనరిచి, పరిపూతుండయ్యుఁ జెపు
ముపాయము నాకున్. ౨౨౦

వ॥ నావుడు బృహస్పతి యిట్లను భక్తిమై జగదంబిక నారాధించితివేని నీపతి యచిరంబ నీకుం బొడకట్టు నంతియ కాక నహుషుండు తన్మాయామోహితుండై పదభ్రష్టుండును నగు నని మంత్రం బుపదేశించిన. ౨౨౧

క॥ తాపసివేషము గొని స, ర్వాపద్ధారిణిఁ బరాంబ నర్చించినఁ దా
నాపడఁతి కొక్కనాఁడు ద, యాపరతన్ దర్శనంబు నాపెఁ గొనంగన్

సీ॥ కోటిసూర్యులఁ బోలి కొమరారుకాంతితోఁ జంద్రకోటుల నేలు
శైత్యమొలయఁ, గోటివిద్యుత్తుల మీఁటుబల్తళుకుతో వేదముల్
నాలుగు వెంటరాఁగ, స్వచ్ఛముక్తాదామ సంభూషితాంగియై కను
లు మూఁడును గాంతి గడలుకొనఁగ, బాశాంకుశాదులు బాహులఁ
దనరఁ బ్రసన్నవక్త్రాంభోజశాలిని యయి॥ గీ॥జనని ప్రత్యక్షమై శచీ
సతికిఁ బల్కె, నబల! నీపూజ నానందమబ్బె నాకు, వరము గోరు
ము నా నామె పతిసమాగ, మంబు నహుషునికిఁ వినాశంబుఁ
గోరె. ౨౨౩

వ॥ అనిన జగదంబ యొక్క దూతికం జూపి దీనివెంబడి నరుగు
మియ్యది నీపతిం జూపు నని వెండియు. ౨౨౪

గీ॥ విశ్వకామాఖ్యచేతను వెలయునాము, మూర్తి వొల్పెడిమానసమున
సురేంద్రుఁ, డున్నవాఁ డట కేగుమీఁయువిదతోడఁ, గనుఁగొనుము
మోద మందుము కమలనయన. ౨౨౫

శచి యింద్రునికడ కరుగుట.

వ॥ నహుషుండును మన్మాయామోహితుండై స్వల్పకాలమ్మునఁ
బదభ్రష్టుండు కాఁగలఁ డని చెప్పి యాపె యంతర్ధానమ్ము నొందె. ౨౨౬

ఆ॥ వె॥ అంబదూతి శక్రునంగనఁ గొని పోయి, మానసాంతరమున మ
గ్నుఁ డైన, యింద్రుఁ జూపె శచియు నింతింతనఁగరాని, సంతసమ్ము
నొందె జనవరేణ్య. ౨౨౭

వ॥ ఇట్లు సంతసం బందియుఁ బతి దుర్గతికిం జింతించుచుఁ గమలా
క్షిం గని యిం ద్రుం డిట్లను. ౨౨౮

క॥ కమలేక్షణ? యిచ్చటి కే, క్రమమున వచ్చితివి భూతగణములకు నదృ
శ్యముగు గతినున్న నావా,సము నీ కెట్లెఱుఁగనయ్యెఁ జయ్యనఁ జెపుమా

వ॥ అనిన శచి యిట్లను జగజ్జననికరుణం జేసి నిన్నుం జూడఁ
గంటి నిఁక నొక్క విశేషంబు వినుము ౨౩౦

క॥ సురలందఱు నహుషుని దే,వరయాస్థానమున నిల్చి వైభవ మెసఁగన్

బరిచర్యసలుపుచుండిరి, మరియాదకుఁ దక్కవాఁడు మమతయెలర్పన్

క॥ వరియింపుము ననుఁ బతిగా, సురేశ్వరుఁడ నే నటంచు సొలవశకామా
తురుఁడై ప్రతిదినము నను౯, బరిపరి మోమోట పెట్టి బాధించు
నొగి౯. ౨౩౨

క॥ నావుడు దేవేంద్రుం డను, దేవీ! వగవకుము నేఁ బ్రతీక్షించెద మో
దానహ మగుకాలమునకు, నేవానికి దాఁటఁజెల్లునే కాలగతుల్.

వ॥ నీవునునుకూలకాలంబు ప్రతీక్షించుచు స్వస్థచిత్తవై యుం
డుము పొమ్మనవుడు శచి దీనాననయై యతని కిట్లను. ౨౩౪

చ॥ ఎటు నిలువంగ నేర్తు సురలెల్లరు మానులఁ గూడి రాగలం
పటు వరదానగర్వితు నపాస్తనయు౯ బతిగా వరించి య
క్కట! నను వానిఁ బొందు మనఁ గాచెడివాఁడు గురుండు దక్కలే
కిటు చనుదెంచితి౯ మరల నేఁ జనినన్నను బల్మిఁ బట్టఁడే. ౨౩౫

క॥ ఆరయఁ బాలుఁడు విమలా, చారుఁడు విద్యాధికుండు సత్తముఁడు
గురుం, డేరీతిఁ గావఁ గలఁ డక, టా! రాజగునహుషు బారి కండక
యుండ౯. ౨౩౬

ఆ॥ వె॥ కులటనైన వానిఁ గొని సుఖమ్ముల నంద, నిచ్చగింతు నకట!
యీపతివ్రత, తాత్వ మెంత దీనదశ దెచ్చె నని వగ, నగడు చెందు
సతికి నని యోఁ బతియు. ౨౩౭

వ॥ నీ కుపాయం బొందు చెప్పెద నాలకింపుము.

క॥ శీలమున మానరక్షణ, మేలలన యొనర్చు నద్దియే సతి భర్తల్
పాలింపఁ బతివ్రతలగు, లీలావతు లెందఱేని లేరె జగమున౯. ౨౩౮

క॥ కావున శీలము తోడుగ, నీ వుండుము పొమ్ము వాఁడు నిన్ను బలిమియై
నేవేళఁ బట్టఁ దివురునో, యావేళ౯ బలుకు మిట్టు లామూర్ఖునితో౯

వ॥ "నీవు ఋషియానమ్మున నాయెడకు వచ్చితేని నీయందు బద్ధా
నురాగనై యే నిన్ను వరించెద" నంటివేనిఁ గామాంధుం డగువాఁడు

ను మునుల నియోగించి క్రోధాకులు లగువారిశాపమ్మునఁ బదభ్రష్టుం
డగు నిదియునుగాక. ౨౮౦

ఆ॥వె॥నిర్నిమిత్తకరుణ నెగడెడిజగదంబ, భక్తి మీఱఁ గొల్చి భద్ర దా
త్రి,మైనయాపెకతన నందుము సంసిద్ధి,గురునివాక్యమందు గుఱుతు
గలిగి. ౨౮౧

వ॥ అనునాతనిపల్కు లకియ్యకొని శచియు నహుషునిపాలికిం
జనఁ గామాంధుండగునాతఁ డాపె కిట్లను. ౨౮౨

చ॥ కుశలమె నీకు సత్యమునకుం జవరాఁటనిదాన?నీయెడన్
వశు నను దాసు సత్యగతిఁ బాలన చేయఁగ వచ్చితే? చతు
ర్దశభువనమ్ము లేలినముదం బొకపాలిది యొక్కపాలు దు
ర్దశఁదొలఁగించి నన్ మదనదగ్ధునిఁ జల్లనిదృష్టి నేలుమా. ౨౮౩

ఆ॥వె॥నీయభీష్ట మెద్ది! నేనిర్వహింతు ని,క్కమ్మునొడువు లజ్జగాంచ నేల?
యనుడు దేవదేవి యఖిలంబు సిద్ధంబ, లేదు కోర నొండు లేశమేని.

వ॥ ఐనను నా కొక్కమనోరథమ్ము గల దయ్యది నిక్కువమ్ముగ
నెఱవేర్చెదేని నొడివెద నావుడు నహుషుం డెంత యసాధ్యంబేని నిర్వ
హించెద నొడువు మన శచి యాతని కిట్లనియె. ౨౮౫

ఉ॥ చెప్పుట కేమి ప్రత్యయము చేకుఱ దేమన రాజు లాడియే
తప్పుదు రెయ్యెడన్ విను వృథావచియింపఁగ నేల? నామనం
బొప్పెడియంతయొట్టునకు నొప్పితివేని వచింతు నా నతం
డప్పగిదిన్ బొనర్ప మనమందు వినిశ్చయ మంది యిట్లనున్ ౨౮౬

వ॥ తరుణీ? నే నాడినదానికిఁ దప్పితినేనియజ్ఞదానతపోజన్యం బగు
మత్సుకృతమ్ము వమ్మగు ననుడు నాపె యిట్లనియె. ౨౮౭

సీ॥ వాహనమ్ములు దేవపతికి గజమ్ము లేనుఁగు రథమ్మును, హరికి గరు
డుండు, యమునకు మహిషంబు హరునకు వృషభంబు హంస బ్ర
హ్మకు నెమ్మి హరసుతునకు, నెలుక విఘ్నేశున కురు నీ కిప్పు డపూ
ర్వవాహనము నద్భుతము గాఁగ, వాంఛింతు నిను మునివరులు శిబి

క నుంచి యేగింపఁ జూచి దేవేంద్రకన్న॥ గీ॥ సధికునిఁగ నెంచి నీ
వృద్ధి ననుమతించి, పొంపఁ గోరెద నావుడు మందబుద్ధి, యంబికా
మాయకతన మోహాంధుఁ డగుచు, నగుచు నయ్యబ్జముఖి కనె
నహుషుఁ డెలమి. ౨౮౮

గీ॥ సత్య మగుమాట చెప్పితి జలజనయన, సదృశ మగువాహనము నా
కు సంతరించి, తనఘులు మునీశ్వరులు మోయు నంతకన్న, ఘనత
గల్గునె యొండు లోకముల నెందు. ౨౮౯

క॥ మును లేద్వురు మోయఁగఁ ద్రిక్కిన ఋషులుం దోడ రా నొరగెన్ శి
బికారూఢుని నన్నుఁ జూడఁ గల వ్రై, వనజానన? నిన్నుఁ బొంద
వచ్చినవేళన్. ౨౯౦

వ॥ అని శచికిం బ్రియంబు వల్కి యచ్చోటు విడిచి మునులం
గని స్మరాతురుండు నహుషుం డిట్లనియె. ౨౯౧

ఉ॥ ఏను సురేంద్రుఁడన్ శచియు నింతటిదన్కను నన్నుఁ బొంద దో
మానివరేణ్యులార? యవమానము గాదె? యనుగ్రహించి నా
మానము నిల్పఁగాఁ దగినమాన్యులు మీర; లొకించుకేని య
మ్మానిని మానినన్ దులువ మారుఁడు నిల్వఁగ నీఁడు నన్నిఁకన్.

క॥ ఆనెలఁత పొందు యుష్మదధీనంబై యున్నయది విధించె న్ననుస
న్మానివరేణ్యులు మోసెడి, యానముపై నెక్కి పొందనరుదెమ్మనుచున్

వ॥ ఇయ్యది మీర లనుగ్రహింపకున్కి నెట్లు సమకూడు మీకు
శరణాగతుండ న న్నీమదనభూతంబువలన రక్షింపవలయు నన నగస్త్య
ప్రముఖు లగుమును లందఱును భావికార్యానుసరణమ్మున దయామతు
లై యంగీకరించుటయు నహుషుండును బౌలోమీగతమానసుండగు
కతన దివ్యమునివాహకం బగుశిబిక నధిష్ఠించి. ౨౯౪

చ॥ స్మరపరిపీడితుం డతఁడు చయ్యన నచ్చెలిఁ జూచువేడ్క స
త్వరమతియై యగస్త్యమునివర్యు సముద్రము మ్రింగినట్టియు
ద్ధురుఁ దనకాలఁ దన్ని కశతో నదలించుచు "సర్ప సర్ప" నాఁ
గరము కశాహతిం గనలి గ్రక్కున సర్పముగా శపించుచున్. ౨౯౫

### ఇంద్రుఁడు స్వర్గము నొందుట

క॥ మగల నిటు పల్కు బహువ,త్సరముల రణ్యమున నుండి సత్త్వము కల్మిన్
దిరుగుచు నుండ యుధిష్ఠిరుఁ, డరుదెంచున్ శాపముక్తి నతఁడిడు నీకున్.

వ॥ ధర్మపుత్రుండు నీప్రశ్నంబుల కుత్తరంబిచ్చువాఁడు తచ్ఛ్రవ
ణమాత్రమ్మున నీశాపమ్ము దొరఁగి స్వర్గమ్మునకు రాఁగలవని నుడివె ౨౫౭

ఆ॥వె॥ నహుషుఁ డంతఁ బడియె నాకమ్ము నుండి తా, నహియు నగుచుఁ
గాననాంతరమున,నుండె వాసవుం డఖండశమదమ్మును, జెందె దీనివిని
కిఁ జేసి యుధిప. ౨౫౮

వ॥ అంత సురలును మునులును నింద్రునికడ కరిగి మానపూర్వ
కమ్ముగా నాశ్వాసించి యథాప్రకారమ్ముగ స్వస్థానమ్మున నిలిపి యభిషేక
మ్మొనరింప నతండును జిరవిరహిణి శచిం గూడి నందనవనమ్మున విహరించు
చు సుఖం బుండె. ౨౫౯

చ॥ అనఘుని విశ్వరూపుని మహాత్ము మునిన్ దనుజున్ వధించి దుః
ఖనియుతుఁ డయ్యె నింద్రుఁ; డిటు నిర్మల దేవి యనుగ్రహింపఁ గై
కొనె ముదమున్; సమస్తమునకున్ దనకర్మము కారణంబు దా
నిని విడఁజెల్ల దేరికిని నిక్క మెఱుంగుము భూప నావుడున్. ౨౬౦

చ॥ నరవరుఁ డిట్లు పల్కు మునినాథ? శతక్రతుకర్తయై సుఖో
ద్ధుర మగు స్వఃపదంబు గొని దుఃఖితుఁ డయ్యె సురేశుఁ డంటి త
క్కొరులకు సస్తదాములకు నొక్కెడ సౌఖ్యము చిక్కునే? కృతా
దరునకు నాకు శిష్యునకు దాఁపక సర్వము దెల్పు నావుడున్. ౨౬౧

### కర్మవిశేషములు.

గీ॥ వ్యాసుఁ డిట్లనుఁ గర్మము వర్తమాన, మనియు సంచితమనియునో
యవనినాథ, తెలియఁ బ్రారబ్ధమనియు మూఁడు దెఱఁగులగును, గారణం
బిద్దియ సర్వకార్యములకు. ౨౬౨

వ॥ అందు నానాజన్మసంపాదితంబు సంచితంబు, నదియు సా
త్త్విక రాజస తామసభేదమ్ముల నాకర్మంబు త్రివిధంబు. ౨౬౩

క॥ ఘనము శుభాశుభరూప, మ్మునఁ దగు సంచితము భోగమునఁ దీఱు
నొకిం,తన పోదనేకజన్మము, లనుభవమున కెత్త వలయు నది ఘ
నమగుటన్. ౨౬౪

గీ॥ జననమందినదాదిగ సలుపుకర్మ, మరయు నది వర్తమానవిఖ్యాతి
నెసఁగు, సంచితమ్ముల నడిమికి సగము సేయు, నమరుఁ బ్రారబ్ధమై
జననాది కదియు. ౨౬౫

గీ॥ పీకు వారవ నేలయెవ్వారికేని, జనదు ప్రారబ్ధ మనుభవమునకుఁ
దక్క, కర్మ మున్నంతదనుక నిక్కమ్ము జన్మ, మది యడఁగఁ మీఁద
జన్మంబు నడఁగు నిజము. ౨౬౬

క॥ హరియును హరుఁడును సురలును, విరించియును గర్మవశులు విత
వేనినరే, శ్వర ? దేహధారులై యి, క్కరణి శుభాశుభము లందఁ
గా నేమిటికిన్. ౨౬౭

వ॥ దేహి తనకు సుఖదుఃఖానుభవకారణం బగు కాలపరిపాక
మ్మువలన సంచితకర్మానుభవావసరమ్మున సుకృతం బొండె దుష్కృతం
బొండె సలుపు చుండు నట్లు దేవతలును నని యెఱుంగుము. ౨౬౮

క॥ నారాయణాంశజులు నర,నారాయణమునులుధర్మనందనులు భువిన్
ధీరులు కృష్ణార్జునులై, పేరందుట దీనఁగాదె పృథ్వీరమణా. ౨౬౯

వ॥ ఇత్యాది పురాణపీఠిక యని మునులచే వ్యవహరింపం బడు
నని మఱియును. ౨౭౦

గీ॥ అధిప! విభవాధికుండు దేవాంశభవుఁడు,కవిత గలవాఁడు ఋష్యం
శ కలితుఁడెవఁడు,రుద్రి నర్పించు నవ్వాఁడు రుద్రునంశ, మవని పా
లించువాఁడు విష్ణ్వంశభవుఁడు. ౨౭౧

వ॥ మఱియు నన్నదాతయు దేవాంశభవుం డగు నింద్రాగ్నియు
మవిష్ణుధనదులవలనఁ బ్రభుత్వప్రభావకోపపరాక్రమంబులను సంగ్ర
హించి శరీరంబు నిర్మింపం బడెడి. ౨౭౨

క॥ బలవంతుఁడు ధనవంతుఁడు, కలావిదుఁడుభోగశాలి ఘనభాగ్యము

లం, దులఁదూఁగువాఁడువీరలు, తెలియుము దేవాంశభవులు తెల్లము
గనృపా. ౨౨౩

వ॥ పాండవులును నిట్టిరగుట విఖ్యాతు లైరి దేవాంశజుండగుకత
న వాసుదేవుండును నారాయణసముండై వఱలె ౨౨౪

గీ॥ ఏది యెట్లైనఁ బ్రాణులకెల్ల దేహ,మమరు సుఖదుఃఖములకుఁ గా న
ట్టి దేహి,స్వవశుఁ డొక్క రుఁడును లేఁడుజననమరణ,కష్టములు దైవవ
శమునఁగాంచుచుండు. ౨౨౫

వ॥ మఱియుఁ బాండవులు వనింబొడముటయుఁ బిదపఁ బురమ్మున
కరుగుటయు బాహుబలమ్ముకలిమి రాజసూయం బొనర్చుటయుఁ గ్రమ్మఱ
వనవాసదుఃఖం బనుభవించుటయు నర్జునుండు తపంబు చేసి సురలవలన
వరమ్ము గొనుటయు ననునివి యన్నియుఁ గర్మజంబులకా నెఱుంగునది.

క॥ నర దేహమ్మున మున్ను బదరి కాశ్రమమందుఁ జేయుతప మర్జునతం
బొరసినయప్పుడుఫలదం, బరయఁగఁగాకున్కిఁ గర్మ మతిగహనంబా

వ॥ అని వెండియు॰

సీ॥ కారాగృహమ్మునఁ గఁజాక్షుఁడుదయించి యంతట గోకులమందుఁ జేరి
యేకాదశాబ్దమ్ము లెలమి నచ్చటనుండి మధురకు నేగి దుర్మార్గుఁగంసు
నడఁచి యాతనితండ్రి నధిపునిఁగాఁ జేసి తల్లిదండ్రులకు బంధనము
వాపి, మ్లేచ్ఛాధిపునభీతి మేకొన ద్వారవతీపురమ్మున కేగి కాఁపుర
మ్ము॥ గీ॥ చేసి సకుటుంబముగను బ్రభాసమున ధ, రాదితిజశాపము
నఁ దెగి యంత మందెఁ, గర్మగతి యెట్టి దేనియుఁ గాకయున్న,
వ్యాధుఁడా? కృష్ణుఁ జంపెడివాఁడు తలఁప. ౨౨౬

వ॥ నావుడు జనమేజయుం డిట్లను మునీంద్రా! భూమిభారమ్ము
సహింపక గోరూపధారిణియై కమలజు శరణమ్ము వేఁడిన నతఁడు జనా
ర్దనుఁ బ్రేరేపించి భూభారహరణమ్మునకు వసుదేవగృహమ్మునఁ బుట్టు
మన విష్ణుండును నట్లు జనియించి బలరామసహితుండై యర్జునుండు
తోడ్పడ ననేకుల దుర్మతుల నడంచె నని చెప్పితివి దానం జేసి భూమి

కేమి భారంబు గాకేఁగె నిదియిట్లుండఁ భీష్మద్రోణవిరాటద్రుపదబాహ్లీక
సోమదత్తకర్ణాదులం జంపెఁ గాని తనయునంతరమ్మున భార్యలఁగొట్టి
దోఁచికొన్నదొంగల మును మున్న యేలవధింపఁడయ్యె నాభీరశకమ్లేచ్ఛ
నిషాదులు కోట్లకొలఁది మిగుల నేల? వారలు భూమికి నేల భారకా
రులు గాకుండిరని వెడియు. ౨౭౯

కం॥ కలుషావృతమై తగునీ, కలియుగమున నొక్కఁడేనిఁ గలఁడే? యో
గ్యుం,డిల కిది భారము కాదే, తెలుపుము నా మానిభూపతికి నిట్లనియెన్

గీ॥ ప్రజలు యుగములఁ బట్టి పాపమ్ముఁ బుణ్య, మాచరింతురు యుగధ
ర్మములఁగలరె, ధర్మమున రెంట మూటఁ దత్పరతఁగలరు, క్రమ
ముగా మూఁడుయుగములఁ గలుగు ప్రజలు. ౨౮౧

వ॥ కలియుగమ్మున సద్ధర్మపురసికులు దక్కనొండొరులు జని
యింపరు ధర్మాధర్మములకుఁ గర్తకాలంబ యని యెఱుంగుము నావు
డు నృపతి యిట్లనియె. ౨౮౨

కం॥ కృతమున ధర్మము త్రేతన్,మితిమీఱెఁ దానమున్ యమితులై నానా
వ్రతములు ద్వాపరమున సమ్మతిఁ జేసినవారి కేది మానికిఁయిపుడుగున్

కం॥ ఈ కలియుగమునఁ బాప, వ్యాకులులై దేవనింద యాదిగఁదగు నా
నాకృతులొనర్చుదుర్జను, లాకృతయుగమందు నెచటి కరుగుదురు
మునీ. ౨౮౪

వ॥ నావుడు వ్యాసుం డిట్లనియె.

కం॥ కృతయుగమున మనుజులు ని, స్తులితముగఁ బుణ్యము లొనర్చి దివి
జనగరసు, స్థితిఁగాంతురు వర్ణాశ్రమ, గతు లించుకయేనిఁ జ్యుతినిఁ
గనకున్కి నృపా. ౨౮౫

గీ॥ దయయు సత్యంబు దానంబు తనదుభార్యఁ, గూడియున్కియు ద్రో
హమ్ము గోనమి సర్వ, భూతసమబుద్ధియును సతమ్ములు సమస్త,జంతు
వులకుఁ గృతమ్మున జనవరేణ్య. ౨౮౬

వ॥ రజకాదివర్ణమ్ములును నయ్యుగమ్మున స్వధర్మనిరతిం జరించు

టం జేసి స్వర్గమ్మున కరిగెడిఁ దేత్రాద్వాపరమ్ములను నట్లకా నెఱుంగునది.

క॥ నయహీనులు మానవులు క,లియుగమ్మునసుకృతబుద్ధిలేమిన్ యుగప
ర్యయ మలవడుదన్కను ని,శ్చయముగ నరకమున నుందుఱ జననాథ
మణీ. ౨౮౮

క॥ కలికృతసంధిన్ స్వర్గ, స్థులుపుడమి జనింతుఱ మిగుల దుష్టులు నరక
స్థులు జనియింతురు ద్వాపర, విలయమ్మునఁ గలియుగంబు వెలయం
జేయన్. ౨౮౯

క॥ కలియుగమున సుజనులునుం, గలిగిన నవ్వారు సుకృతకర్మానుగతిన్
వెలయుదురు ద్వాపరమ్మున, నల త్రేతన్ గృతమునందు నధిపవతంసా.

క॥ విను మట్టులకృతయుగమున,నన యుతఁ బాపములు సేసినట్టిజనులు దు
ర్జనహిత మగుకలియుగమున, జనియించి యపాత్రకృతులు సలుపు
దు రెందున్. ౨౯౧

యుగధర్మములు.

క॥ యుగరీత్యనుసరణమ్మునఁ,దగు ధర్మజ్ఞులకుఁ బాపతత్పరత పవిత్,స్త్గు
ణుం డగునీతండ్రికిఁ, దగు నే మునియుతఁ బాపు దగులం జేయున్.

వ॥ యుగబలంబ కా దేని యయాతికులసంభవుం డగురాజన్యున
కిట్టిబుద్ధి యెట్లు పొడము నని చెప్పి వెండి యు. ౨౯౩

చ॥ కృతయుగమందు బ్రాహ్మణులు కేవలవేదరతుల్ పరాంబికా
మతులు దయాయుతుల్ శుచిసమన్వితు లట్టులె క్షత్రియుల్ సు
సంగతపరిపాలనాదరు లఖండయశుల్ మఱి వైశ్యులున్ సమం
చితకృషిగోగణావనవిశిష్టవణిక్క్రియానిత్యతత్పరుల్. ౨౯౪

వ॥ మఱియు శూద్రులు సేవాతత్పరులై యుండిరి సకలవర్ణమ్ము
లయందును దేవిపదభక్తి విశేషించి యుండెఁ బ్రతిగ్రామమ్మున జగదం
బాలయమ్ములు మెండునునై యుండె. ౨౯౫

క॥ కృతయుగముకన్నఁ దేత్రన్, మితమగు ధర్మమ్ము మిగుల మితమగు

ధర్మస్థితి ద్వాపరమునఁ గలియుగ, గతి సెప్పఁగ నలవి కాదు కలుషిత మగుటన్.

౨౯౬

క॥ మును రక్కసు లిక్కలియుగ, మున విప్రులుగా జనించి మూర్ఖు లసత్యం,బున ఘనులను బాషండులు, జనవంచకు లనఁగఁ బరఁగి చరియింతు రొగిన్.

౨౯౭

గీ॥ వేదనిందాపరులు లోకవిదులు శూద్ర, సేవనాసక్తులు సధర్మజీవనులును, భ్రష్టులును గాఁగలరు క్రమక్రమమునఁ గలి, వృద్ధి చెందిన కొలఁదిగ విప్రవరులు.

౨౯౮

క॥ కలియుగము వృద్ధిఁ జెందిన, కొలఁది ఋతోద్భవము ధర్మగుణము నశించున్, గలుషమ్ము వృద్ధి నొందుఁ బ్రి, బల మగు నన్యాయరీతి ప్రజలందు నృపా.

౨౯౯

గీ॥ క్షత్రియులు వైశ్యులును శూద్రసంతతులును, ద్విజులయట్ల స్వధర్మముల్ దిగ విడుతురు, ద్విజులు శూద్రులరీతి వర్తించి దుష్ప్రతిగ్రహమ్ము లొనర్తురు తేజ మెడల.

౩౦౦

చ॥ అనృతము వల్కుదుర్ పరులనంటుదు రిచ్ఛకు వచ్చినట్లు వర్తన మొనరింతురు ధర్మములు తా రయి చెప్పుదు రాత్మభర్తృ ప్రవంచన మొనరింతు రంగనలు సాధ్వి యొకర్తుక గాని కాన రాఁ జనదు కలిన్ జగమ్ము కడు సంకరరీతినిఁ బొల్చు భూవరా.

౩౦౧

గీ॥ శుద్ధ మాహార మైన విశుద్ధ మగు మ, నంబు దాన నెసంగు ధర్మంబు వృత్తి, సంకరతఁ జేసి ధర్మంబు సంకర మగు, దాన వర్ణ సాంకర్యం బొదవు నృపాల.

౩౦౨

క॥ కలియుగమున నివ్విధమునఁ,దొలఁగున్ వర్ణములపద్ధతులు విజ్ఞానంబలవదుమహాత్ములును జం, చలులై దుష్కృతులు సేయఁ జాలుదు రనఘా,

౩౦౩

వ॥ ఇయ్యది యుగస్వభావం బగుట నేరికిని నవార్యం బనుడు జనమేజయుండు.

౩౦౪

క॥ కలుషప్రధానమై తగు,కలియుగమునఁ బొడముప్రజకు గతికల దేనిన్
సొలవక చెప్పు మనఁగ న, య్యలఘున కిట్టులను వ్యాసుఁ డాదర మెసఁగన్. ౩౦౬

చ॥ కలిఁ గలుషంబు వాపికొనఁగా మదిఁ గోరునరుండు సర్వముం
దొలఁగఁగఁ ద్రోచి శక్తిపదతోయజ మెప్పుడు సంస్మరింపఁగా
వలయుఁ దదీయనామరసపాన మొకప్పుడుఁ గాని చేయువా
రల కగు సౌఖ్యముల్ హరిహరప్రముఖుల్ గన లేరు భూవరా. ౩౦౭

క॥ తగుపుణ్యక్షేత్రమ్మున, నగణితమహిమాఢ్య మైనయంబాపద మె
ప్పుగఁదలఁచెడివారలు పా, పగతిం గన రిది రహస్యపద్ధతిసుమ్మీ.

క॥ పాయక యజపాఖ్యం బగు, గాయత్రి జపింతురి ద్విజులు గనఁ జాల
రుగా, మాయావిభవము వారలు, ధ్యేయం బంబాపదంబ తెలియుము నీకున్. ౩౦౮

వ॥ యుగధర్మవ్యవస్థయందు నీ వడిగినప్రశ్నంబున కుత్తర మిచ్చితి నింక నీకభీష్టం బెద్ది యనవుడు దేవమానవులకు గమ్యమ్ములును బుణ్యమ్ములును నగుక్షేత్రమ్ములును నదులును స్నానదానాదివిశేషమ్ములును విస్తరించి నా కెఱింగింపు మన వ్యాసుం డిట్లనియె రాజేంద్రా! యెల్లనదులలో జాహ్నవి యుత్కృష్టంబు మఱియు యమునాసరస్వతీ నర్మదాగండకీ సింధుగోమతీతమసా కావేరీచంద్రభాగా వేత్రవతీసరయూ ప్రముఖమ్ము లగునదులు నూర్లకొలఁది గలవు. ౩౦౯

తీర్థవిశేషములు

గీ॥ ఈనదులలో సముద్రమ్ము నెనయున్నవి వి, శేషపుణ్యప్రదమ్ములు సింధుగ
తము,లందు జల మెప్పుడును గలయవి ప్రశస్త,ములు నదులు వర్ష
ముల రజస్వలలు భూప. ౩౧౦

వ॥ శ్రావణభాద్రపదమాసమ్ముల నానావిధకలుషితప్రవాహమ్ములకలిమి రజోదోషమ్ము వాటిల్లునని యెఱుంగునది వెండియుఁ బుష్కరమ్మును గురుక్షేత్రమ్మును ధర్మారణ్యమ్మును ప్రభాసమ్మును బ్రయాగ

మును నైమిశారణ్యమ్మును నర్బుదారణ్యమ్మును నివి పుణ్యక్షేత్రమ్ములు శ్రీశైలమ్మును సుమేరుపర్వతమ్మును గంధమాదనమ్మునననివి పుణ్యధరాధరమ్ములు మానసమ్మును బిందుసరస్సును నచ్ఛోదంబును ననునివి పుణ్యసరోవరమ్ములు. ३००

క॥ నరనారాయణమును లా, దరమున నెచ్చోటఁ దపము దాల్చిరి దానిం, బరమోత్తమ మనఁదగదె బ, దరికాశ్రమ మనఁగ విశ్రుతం బది యధిపా. ३०२

వ॥ మఱియు వామనాశ్రమమ్మును శతయూపాశ్రమమ్మును మొదలుగఁ బుణ్యాశ్రమమ్ము లనేకమ్ములు గలవు. ३०३

క॥ మునిజనములు తపములు తా, మొనరించినచోటు లెల్ల నొగిఁ బుణ్యంబున విఖ్యాతి గని పుణ్య, మ్మునకుం దానకము లగుచుఁ బొదలె నృపాలా. ३०४

వ॥ నా చెప్పిన స్థానమ్ములలోఁ గొన్ని దేవీస్థానమ్ములు గల వయ్యవి దర్శనమాత్రఫలదంబులు వాని నగ్రమ్మునం జెప్పెదఁ దీర్థమ్ములును దానమ్ములును యజ్ఞమ్ములును దపమ్ములును వ్రతమ్ములును లోనగుపుణ్యకర్మములు సాపేక్షమ్ము లని యెఱుంగు మది యెట్లంటేని

క॥ శుద్ధం బగు ద్రవ్యమ్ము వి, శుద్ధం బగుమనము శుద్ధిఁ జొప్పడుక్రియ స న్నద్ధంబు గాక యున్న న, బద్ధం బగు నిందుఁ జెందు ఫలము నృపాలా. ३०६

క॥ క్రియయును ద్రవ్యము శుధ్యా,శ్రయముగ నొక్కప్పుడెనయుఁ జంచలము మనం, బయవిఘ్నకారణముల వి, షయములఁ బడుక తన శుద్ధి చన దెప్పట్లన్. ३०७

వ॥ కామక్రోధలోభమదాహంకారమ్ములు తీర్థాధ్వరవ్రతతపోనియమమ్ములకు నంతరాయప్రదమ్ములు మఱియు నహింసయు సత్యాస్తేయశౌచేంద్రియనిగ్రహస్వధర్మపాలనమ్ములు తీర్థఫల ప్రదంబులు ३०८

గీ॥ దారి సంసర్గదోషమ్ము దవిలి నిత్య, కర్మ మెడలినకతన నిక్కముగఁ

దీర్థ, గమన మది వ్యర్థ మగు స్నానకలన దేహ, శుద్ధి దగుఁ గాని
మనమును శుద్ధ మగునె. 3౧౯

క॥ విను తీర్థస్నానమ్మున,మనమును శుద్ధంబయే నమరనదికిం దా,పున
వసియించి తపంబును, బొనరించెడిమునులు దోహబుద్ధులగుదురే

వ॥ చిత్తశుద్ధిగుయుం బగుగంగాదితీర్థసేవనం బతిపావనం బగు
కతన నాంతరమలక్షాళనంబును బొనరింప సమర్థంబ యైనను నంతశ్శు
ద్ధికి నొక్కసత్సంగంబుదక్కఁ దక్కుఁగలయజ్ఞదానాదికర్మములు నిమి
త్తమ్ములు గాఁ జాలవు మున్ను బ్రహ్మపుత్త్రుం డగువసిష్ఠునకును విశ్వా
మిత్రునకును నాడీబకం బను ఘోరయుద్ధమ్ము నిరర్థకమ్ముగ హరిశ్చంద్రు
కతమునఁ గలిగె నందు వసిష్ఠశాపమ్మున విశ్వామిత్రుండు బకంబును
విశ్వామిత్రశాపమ్మున వసిష్ఠుం డాడియును నైరి. 3౨౧

క॥ వా రాడీబకరూపము, లీరీతిం దాల్చి రణము నెనసిరి మిగులన్
దారుణగతి వర్షాయుత, మూరయ మానససర స్తటారూఢిఁ దగన్.

వ॥ అన జనమేజయుం డక్కత వినవలతు ననుకు సాత్యవతే
యుం డిట్లనియె. 3౨3

క॥ రవివంశజుండు రఘురా,మవిభునకుం బూర్వుఁ డనఘమతియున్ స్వ
ర్నా,థవిభవుఁ డయినహరిశ్చం, ద్రవిభుండు త్రిశంకరాజతనయుం
డలరున్. 3౨౪

వ॥ అతం డనపత్యుం డగుకతన వరుణుం గుఱిచి తనకు సంతా
నం బొదవిన నరమేధం బొనర్చెద నని ప్రతిజ్ఞ యొనర్చె నంత. 3౨౫

ఆడీబక యుద్ధము.

క॥ ఆతనిసుందరి గర్భో, పేత యయి కుమారుఁగాంచెఁ బ్రియమందితనూ
జాతునకు జాతసంస్కృతి, నాతం డొనరించి చేసె నధికోత్సవమున్.

వ॥ పుత్త్రోత్సవసమయమ్మున బ్రాహ్మణులకు నపారం బగుహిర
ణ్యమ్మును గోవులను నొసంగి తనిపె నట్టియెడ వరుణుండు విప్రవేషమ్ము

న నట వచ్చి కృతసత్కారుండై యాగమనకారణం బడుగు నృపతిం
గాంచి యిట్లను. 328

ఆ॥ వె॥ సుతునిఁ బశువుఁ జేసి సొలఁపక యాగంబు, సలిపి నీదుప్రతిన నిలు
పు మనుడు, విహ్వలాత్ముఁ డగుచుఁ బృథ్వీశ్వరుండు ధై,ర్యంబు కొం
త గాంచి యతని కనియె. 329

క॥ ఓసదయ? యిత్తలోదరి, మాసమునకు శుద్ధిఁ జెందు మానక నీకై
చేసెద యాగం బప్పుడు,నాసత్యము చూడు మనఁదన యెడకునరిగెన్

వ॥ పదంపడి హరిశ్చంద్రుండు సంతుష్టుం డయ్యును గించిచ్చిం
తాభరమ్మున నుండె. 330

క॥ మాసము పూర్ణంబగుడు ధ, రాసురరూపమునఁ జేరి రాజేంద్రుఁ
బరీ, క్షాసముపేతు నొనర్పఁగ, నాసించి రయమున రాఁగ నానృప
వరుఁడున్.

వ॥ ఉచితసత్కారం బొనర్చి యాతని రాకకుం గతం బెఱిఁగినవాఁ
డు గావున వినయమ్మున నిట్లనియె. 332

క॥ బాలుం డసంస్కృతుం డిఁత,డేలా? యజ్ఞార్హుఁడగు సహింపు ముపనయ
శ్రీలక్షితుఁ డగుదన్కఁ గృ, పాళుఁడవై యనుడుఁ బలికె వరుణుం
డలుకన్. 333

క॥ కొడుకుపయి నడరు నీప్రే, ముడి నా కెఱుఁగంగ నయ్యె మును పలి
కి యిటుల్, దడఁబడఁ జెల్లునె నన్నున్, గడుకొని వంచింప నెంచఁ
గాఁ దగునె నృపా. 334

వ॥ అయినను నీవచనగౌరవమ్మున నిప్పటి కరిగి సమావర్తనక
ర్మానంతరమ్మున నేతెంచువాఁడ సత్యమ్మునకుం దప్పితివేని నిన్నప్పు డవ
శ్యము శపింతు నని యతఁ డరిగెఁ బిమ్మట హరిశ్చంద్రుండు గొమరునకు
లోహితాక్షుం డనునామమ్ము నిచె నారాజసుతుండును దినదినప్రవర్ధ
మానుండై సర్వవిద్యావిశారదుండై. 335

గీ॥ తనకు జన్మంబుకతన నంతంబు గలుఁగు, టెఱిఁగి పరుగిడి యేరికి నే

గ రాని, యద్రిగహ్వరమున డాఁగె నధికభీతి, లోహితాక్షుండు బ్ర
దుకంగ లోఁదలంచి. ౩౩౬

వ॥ పిదప వరుణుం డరుదెంచి జన్నం బొనర్పు మనుడు నరవ
రుండు ప్రమ్లానవదనుండై మహాత్మా? మత్పుత్రుం డదృశ్యుండై యెట
కేనియుఁ బోయె నే నేమి సేయుదు ననుడు వరుణుం డను. ౩౩౭

క॥ నను వంచించి యసత్యా, మ్మునకున్ లో నైతి కాన భూవర ! నీకుం
బనుపడు జలోదరం బను, ఘనతర మగువ్యాధి యనుచుఁ గనలి
శపించెన్. ౩౩౮

వ॥ ఇట్లు శపించి యతం డరిగెఁ బదంపడి హరిశ్చంద్రుండు
వ్యాధిపీడితుండై పుత్రాదర్శనమ్మునకు వగచుచున్నంత. ౩౩౯

క॥ ఒకపాంథుండు హరిశ్చం,ద్రకుమారుం గాంచి పలుకు "వయ మాలి
కటా?, ప్రకటవ్యాధిపరీతు జ, నకు విడిచి యిటుండ నీకు న్యాయం
బగునే. ౩౪౦

క॥ నీకై కుందెడిజనకుని, శోకము గణియింపలేని సుతుఁడవు నీకుం
గాకొరుల కిట్లు చెల్లునె, తేఁకువయొక్కింత వలదె ధీయుత కెందున్.

క॥ జనకునకుఁ గాఁగఁ దనజీ, వనమైనఁ ద్యజించునట్టివాఁడుగుమారుం, డ
నఁదగుఁగాని నినుంబలెఁ,దనప్రాణముడాఁచికొనినఁదనయుం డగునే.

వ॥ ఇట్లు ధర్మసంయుతంబుగ బోధించు పాంథునివచనమ్ములఁ ద్వ
రితుండై తండ్రింగన నరుగ నుంకించునాతనికడకు నింద్రుండు విప్రవేష
మ్మున వచ్చి కృపాళుండునుంబలె నిట్లనియె. ౩౪౩

చ॥ చన మది నెంచఁ బోకు కడు సాహసివై తనరోగబాధ దీ
ర్ప నెదఁ దలంచి నిన్నుఁ దగఁ బట్టి మఖమ్మునఁ బెట్టి చంపు ము
న్నినుఁ గనుపొంచె నవ్వగుణునిన్ వెస నిట్లు యజింతు నంచు నీ
జనకుఁడు నేమ మూనె విను చావఁగ నేటికి నామపల్కులన్ ౩౪౩

వ॥ ఇట్లతనివచనమ్ముల నిషిద్ధగమనుండై లోహితాక్షుండు మా
యామోహితుండై యటఁ గొండొక కాలంబుండి మరల నొకనికత

నఁదండ్రిదురవస్థ విని గమనోన్ముఖుం డగుడు నింద్రుఁడెప్పటియట్ల వారిం
చె నిట్లుతం డెప్పుడు చననుద్యమించు నప్పుడు తప్పక యింద్రుండువ
చ్చి వారించుచుండుఁ బదంపడి యొక్కనాఁడు హరిశ్చంద్రుండు దుః
ఖార్తుండై కులగురుం డగువసిష్ఠుం గాంచి మహాత్మా? జలోదరవ్యాధి
పీడితుండ నగుచున్నాఁడ గరుణింపుము నావుడు వసిష్ఠుండు కరుణార్ద్రుండై
యిట్లను.

గీ॥ కల దుపాయం బొకండు పుత్రులు త్రిరోధ, శవిధముల నొప్పు
దురు ధర్మసమ్మతులయి, యందుఁ గ్రీతునిఁగొని జన్నమాచరించి
వరుణుని యజించి వ్యాధిని బాపికొనుము. ౧౮౪

ఉ॥ నావుడు మంత్రులం గని జనప్రవరుం డిటు పల్కె నెవ్వఁడే
నీవిధికిం దనూజు నిడునేని ధనాశమెయిన్ గొనుండు భూ
దేవకుమారునిన్ వెదకి తెండు ధనం బది యెంతయేనియున్
బ్రోవిడుఁ డిందు లోభమును బూనకుఁ డేగుఁడు శీఘ్రగాములై.

క॥ అని యనుపన్ సచివులు సని, జనపదములు పట్టణములు సదనం
బొక్కం, డునువదలక కనునెడ ని, ర్ధనుఁడు నజీగర్తు డనుధరాసు
రుఁ డొకటన్. ౧౮౬

క॥ కనుపట్టె ధనాశమెయిన్, దనమూఁగురుతనయులందుఁ దా మధ్య
ము న, జ్జనవరుమంత్రుల కొసఁగెన్, ధనలుబ్ధుల కెట్టిపనులు తగవు
నృపాలా. ౧౮౭

వ॥ మంత్రులును దత్ప్రార్థితం బగుధనం బొసంగి శునశ్శేపుం
డనువిప్రకుమారుం గైకొని హరిశ్చంద్రునకుం జూపిన నతండు సంత
సించి యజ్ఞార్థంబగుసంభారం బొనరించి ఋత్విక్కుల రావించి జన్నమ్ము
న కారంభించె నంత యూపబద్ధుం డయి రోదనం బాచరించునాశున
శ్శేపుఁ గాంచి విశ్వామిత్రుండు కరుణాకరుఁడై హరిశ్చంద్రునికిట్లను.

చ॥ జనవర సాహసించి ద్విజసత్త్వముఁ జంపఁగ నేల? విద్యురో
దన మొనరింప నామనము తద్దయు నీరయి పోయె మున్నిదా

జనవరు లాత్మదేహమును జయ్యన నిచ్చి పరాంగరక్షణం
బును బొనరింతు రిట్టిపని బోలునె స్వాంగమురక్షసేతకుఁ. ౩౫౦

గీ॥ నీకు సౌఖ్యంబు గల్గఁగానే నొనర్తు,దయ గలిగి దీను నీవిప్రతనయు
విడువు, మందఱకు నొక్కటే దెహమందుఁ బ్రీతి, బాలకుం జంపె
దీ వెంత పాపమతివో. ౩౫౧

వ॥ అని పలుతెఱంగుల నొత్తి చెప్పిన నత్తాపసుపలుకులు చెవిఁ బె
ట్టక వ్యాధిపీడితుం డగుకతన హరిశ్చంద్రుండు కృతూద్యముండై శున
శ్శేపు విడువ నొల్లఁడ, దానంజేసి గాధిజుండు క్రోధాకులుండై యవ్వి
ప్రకుమారునకు వరుణదేవతా ప్రీతిదంబగు మంత్రం బుపదేశించె

క॥ అతఁ డమ్మంత్రమముం,బ్లుతస్వరముగాజపింపఁ బూర్ణకృపా సం
గతుఁడై వరుణుం డయ్యెడ, కతిరయమున వచ్చి విడిచి యధిపున
కనియెఁ. ౩౫౩

వ॥ రాజా?నీ కిఁక వ్యాధిబాధ లేకుండెడిఁ గృతప్రతిజ్ఞుండ వై
తి వని యరిగె దాన హరిశ్చంద్రుండును సంతసించె. ౩౫౪

క॥ మునిసుతు నిటువిడిపించియుఁ, దనమాటఁ విననినృపు నెదఁ మఱువక
స,న్మని గాధిపుత్రుఁ డున్నం, త నరిగె నొకనాఁడు వని కతఁడు
వేఁటకునై. ౩౫౫

వ॥ అట్లరిగి కౌశికీతటమ్మున నొక్కసూకరముం బడనేయఁ గ్రు
మ్మరువాఁడు మధ్యాహ్నకాలమ్మున వృద్ధబ్రాహ్మణాకారుం డగుకౌశికు
చే వంచింపఁబడి తనరాజ్యం బాది నిఖిలంబును గోల్పోయె. ౩౫౬

క॥ అంత నొకనాఁడు కౌశికుఁ, గాంతారమ్మున యదృచ్ఛగాఁగనికుద్ధ
స్వాంతుండు వసిష్ఠుం డను, నంతయునృపువలనవినినయట్టిండగుటఁ

ఉ॥ నాయుజమానుఁడై ననరనాథు వృథా కపటంబు పూని నీ
వేయపరాధముఁ గనకయే కడు వంచనచేసి తక్కటా?
నీయువినీతి కేమి యన నేర్తు బకక్రియ నీతపంబు దం
భాయిత; తాపసాధమ, యహంకృతి వమ్ముగ నేలతాల్చెదో.౩౫౮

క॥ ఆనరనాయకుని బక, ధ్యానపగత నిట్లొనర్చి తనిసితివి బకం
బైనెగడు మింక ననిశా, పానుగతిన్ బలుక నాతఁడలుక వొడముఁగన్

వ॥ వసిష్ఠుం గాంచి యేనెంతదనుక బకంబనై యుండుదు నం
దాఁక నీవాడివై యుండు మని ప్రతిశాపం బిచ్చె నిట్లన్యోన్యశాపమ్ము
ల నిరువురు నాడీబకమ్ములైరి. ౩౬౦

క॥ ఇరువురును మానసతటీ, తరువుల వేర్వేఱ యుండి తఱుఁగని కోపం
బురహిన్ సఖచంచుపుటో, ద్ధురప్రహారములఁ బోరుదురు ప్రతిదినమున్ ౩౬౧

గీ॥ పక్షిరూపమ్ముఁ గొని మునివరు లిరువుర, రుధిర ముట్టిపడంగ నీరూఢి నె
దిరి, పోరుసల్పుచు బహువర్షములు చెలంగి, సకలలోకమ్ములును భయ
మందుచుండ. ౩౬౨

వ॥ నావుడు జనమేజయుండు వారికి శాపం బెటు తొలంగె నను
డుముని యిట్లనియె. ౩౬౩

క॥ నరులు సురలు భయ మందఁగ, నిరువురు నిట్లుండ బ్రహ్మ యేతెంచి
పరస్పర శాపమ్ములు తీర్చి త, గురహిన్ మిత్రితను గొల్పి గొనకొని
యరిగెన్. ౩౬౪

వ॥ పిమ్మట వారలును దవతమయాశ్రమమ్ముల కరిగి సుఖం
బుండి రెట్టిమహర్షులేనియు నహంకారంబు విడ నోపరు తద్దోషమ్మునన
కదా! మైత్రావరుణికిఁ గౌశికునితో నిట్లు చిరకాలంబు పోరు గల్గె ౩౬౫

క॥ మానవుల సురల నరులన్, దానవులం గాని యెంతదనుక నరసిన్
గానంగ రాఁ డొకండును, మానససంశుద్ధి గల్గుమాన్యుం డధిపా.

ఆ॥ వె॥ మనసు శుద్ధిలేని మనుజుం డొనర్చుతీ, ర్థమ్ము జపముఁ దప
ము దానయజ్ఞ, ముఖ్యకృతులు వ్యర్థములు వాసనారహి, తుసకుఁ ద
త్ఫలంబు దొరకు నిజము. ౩౬౬

క॥ శ్రవణాదికమున మానస, మువిమలముగఁ జేసి తీర్థమునవుండి సదా,
భవహర మగుదేవీనా, మవిభవముజపించువాఁడుమాన్యుండుకలిన్.

వ॥ నావుడు జనమేజయుండు మహాత్మా! మిత్రావరుణియని చెప్పితి వీనామంబు వసిష్ఠునకు గుణప్రయుక్తమో కర్మప్రయుక్తమో నానుడువు మనుడు వ్యాసుం డిట్లనియె. ౩౯౯

వసిష్ఠునికి దేహాంతరప్రాప్తి.

క॥ నరనాయక నిమిశాపముఁ,బొరసి వసిష్ఠుండు దేహము విడిచిమిత్రావరుణులకుఁబొడమిమిత్రా,వరుణియనన్ బరఁగెననృపాలుండనియెన్

క॥ మునిననపరాధుఁ జతురా, ననతిన యువసిష్ఠుభూమినాథుఁడుశపియించిన నెట్లు తవిలెఁ గారణ, మును వచియింపు మన మాని భూపతి కనియెన్. ౩౨౧

క॥ కారణము మున్న చెప్పితిఁ, గా రాజవరేణ్యా? యెట్టిఘనులైనను సంసారమున గుణపరీతులు, ప్రేరేపించు నపి యెట్టి పెనుదుష్కృతికిన్.

గీ॥ రాజు లొనరించునట్టిధర్మములుగాని, పరమమునులాచరించుతపములుగాని, యమరుమాయాగుణప్రేరణమునఁజేసి, కామలోభమయమ్ము లోకమ్ము నిజము. ౩౨౩

క॥ మొదల వసిష్ఠుఁడానిమి, కదయుండై శాప మిచ్చె నాభూపతియున్, బదపడి మునిని శపించెన్, విధి దాఁటఁగ నేరితరమె పృథ్వీనాథా. ౩౨౪

వ॥ ఆజగజ్జననియనుగ్రహమ్ము వడయు రేని హరిహరాదు లైనను విముక్తులు గాఁజాలరు తిదనుగ్రహంబు గలసత్యవ్రతాదులు పామరులయ్యును విముక్తు లగుట తెల్లంబ యని మఱియును. ౩౨౫

క॥ ఆయంబికహృదయం బది,యే యెవ్వారలును గాన రిది నిక్కము కా, నీ యాపె భక్తజనుల న,పాయవిముక్తుల నొనర్చి భరియించు నృపా. ౩౨౬

వ॥ కావున నయ్యంబయందలిభక్తి దోషనిర్మూలనకారణం బగు, నది రాగదంభాదియుక్తం బగునేని బ్రహ్మహత్యాదాయకం బని యెఱుంగుము. ౩౨౭

క॥ అమలతరచరిత్రుండుత్తముఁ డిక్ష్వాకుతనుజుండు ధర్మాత్ముఁడు భూ

రమణశిరోభూషణ మన, నిమి యనునొకచక్రవర్తి నెగడు నృ
పాలా. ౩౨౮

గీ॥ అతఁడు బ్రాహ్మణహితము దా మతిఁ దలంచి, గౌతమాశ్రమమున
కెంజక్కటి జయంతు, పుర మనెడిపేర నొకపురమును నఖండఁ,
సంపదల కాకరముగ నిర్మింపఁ జేసె. ౩౨౯

వ॥ పదంపడి యొక్కయెడ నానృపతినగుండు దీర్ఘకాలం బగు
నొకజన్నంబు సేయఁ దలంచి తండ్రి యగునిక్ష్వాకునాజ్ఞఁ గొని మహా
మున్యుపదిష్టప్రకారంబున సంభారంబులు సంగ్రహించి భృగ్వంగిరో
గౌతమపులస్త్యఋచీకపులహక్రతుప్రముఖు లగుమునుల నామంత్రించి
కులగురుం డగువసిష్ఠుం గాంచి యిట్లనియె. ౩౩౦

గీ॥ ఐదువేలవత్సరము లయ్యెంబ నర్థి, గుఱిచి జన్నం బొనర్చెద గురువ
రేణ్య, సకలయజ్ఞసంభారంబు సంగ్రహించి, నాఁడఁ జేయింపు మన
నృపున కతఁ డనియె. ౩౩౧

వ॥ అంబామఖం బొనర్ప నుద్యుక్తుండై పాకశాసనుండింతకుమున్న
నీపలె నన్నుం బ్రార్థించె నాజన్నంబును బంచశతవర్షాత్మకంబదానినె
ఆచేర్చి పిదప నీజన్నమ్మున కరుదెంచువాఁడ నంతదనుకఁ దాళు
మనుడునిమి యిట్లను. ౩౩౨

క॥ మునులం బిలిచితి జన్న, మ్మునకున్ సంభారమెల్లఁ బూరించితి
మా, యినకులమునకున్ గురుఁడవు, నను వంచన చేసి యరుగ న్యా
యమె నీకున్, ౩౩౩

వ॥ ధనలోభమ్మునం జేసి నీ విట్లొనరింపఁ దగదని మాటిమాటి
కి నివారితుండయ్యు వసిష్ఠుండు గణియింపక సురపతిమఖమ్మునకుం జ
నియె. ౩౩౪

ఉ॥ పిమ్మట వైమనస్యమున వేగ మెలర్ప నిమిప్రభుండు స
త్సమ్మతు గౌతముం గురుపదమ్మున నిల్పి తుషారభూధ్రపా
ర్శ్వమ్మున దేవికిన్ మిగుల సమ్మతిగాఁగ మఖం బొనర్చి ప్రే
మమ్మున నెల్లఋత్విజుల మాన్యులఁ జేసె నపారదక్షిణన్. ౩౩౫

వ॥ ఇంతకు మున్న వసిష్ఠుం డింద్రిమఖంబు సంపూర్ణం బొనరించి తత్కృతపూజలం దనిసి యజ్ఞదీక్షామధ్యమ్మున నిమిం గన వచ్చిన నతండు నిద్రావశుండై దర్శనం బొసంగఁ డాయె దానం గోపించి వసిష్ఠుండు. ౩౮౬

చ॥ కులగురు నం ద్యజించి మదిఁ గొంకక వేఱొకనిన్ వరించి నాయటఁ ఘుపదమ్మున న్నిలిపి యాగ మొనర్చుచు నంతఁబోక యిప్డాల నినుఁజూడ రాఁగ నిటు వంచన చేసితి నీదు దేహ మీయిలఁ బడెడిన్ విదేహగతి నిప్పుడ చెందుము శాప మిచ్చితిన్.

వ॥ అనునమ్మునివచనమ్ములకుఁ దలఁకి భృత్యులు నృపుని లేపిన నతండును జను దెంచి శాపంబిచ్చుట యెఱింగినవాఁడు గావున గురున కిట్లను. ౩౮౭

శా॥ పంకేజాసనునాత్మసంభవుఁడవై పాపమ్ము లెక్కింపకే హంకారమ్మున శాప మిచ్చితివి నాయందింతయున్ లేదుగా పంకం; బక్కట! లోభబుద్ధివయి భూపాలు న్ననున్ శిష్యు నిశ్శంకన్ వీడితి సిగ్గెఱుంగవు ధనాశాలోలుపత్వమ్మునన్ ౩౮౯

క॥ నీదోషము నాయందా, పాదంబి శపించి తింతపాపపుఁగోపం బూఁదిననీ దేహము నకు,నాదశయు ఘటిల్లునిదియన్యాయ్యమ్మగుటన్.

వ॥ ఇట్లిరువురును బరస్పరశాపోపహతు లై రి పదంపడి వసిష్ఠుండు చతురాననుకడ కరిగి యిట్లనియె. ౩౯౧

క॥ నిమి యనురాజన్యుఁడు కా, యము వడఁగ శపించె దేహ మన్యము జ్ఞానాదిమహిమ మియ్యది పోకుం, డ మహాత్మ! యనుగ్రహింపు నావుడుఁ బేర్కిన్. ౩౯౨

క॥ చతురాననుఁ డిట్లను స, మ్మతి మిత్రావరుణదేహమహితాంశ సమన్వితుఁ డవయి పొడమి జ్ఞానస్థితి గని పూజ్యత్వ మంది చెలఁగెదు తనయా. ౩౯౩

వ॥ నావుడుఁ దండ్రిని నమస్కరించి తత్క్షణమవరుణాలయమ్ము

నకరిగి దేహత్యాగం బొనరించి జీవాంశమ్మున మిత్రావరుణులయందుఁ బ్రవేశించె నంతఁ గొండొక కాలమ్మునకు. ౩౯౪

క॥ అచ్చటికి నరిగె నూర్వశి, యచ్చపలాక్షిఁ గని వారలతికాముకులై యచ్చర కిట్లని రెంతయుఁ, బొచ్చెమునకుఁగానికూర్మి పొసఁగి యొసంగెన్. ౩౯౫

చ॥ చెలి? నినుఁ జూచి మానసము చిక్కెను జక్కెరవింటిజోదుకో ల్తలకుఁ; దలంకు మాన్చి దయ దాఁపక యిచ్చకు వచ్చినట్ల దాసుల మముఁ గూడి కేళికలఁ జొక్కము నావుడు వారియందు నిశ్చలమతియై వసించె నటఁ జారువిలోచన కూర్మి పెంపునన్. ౩౯౬

మత్తకోకిల॥ వారితేజము కుంభమందు నవారణన్ బడె నంతలోఁ జారుదేహులు మాను లిర్వురు సంభవించిరి దాన న వ్వారిలోఁ బ్రథముం డగస్త్యి పవిత్రభావశాలి వసిష్ఠుఁడున్ ధారుణీశ? ద్వితీయుఁ డింతయు దైవపాక మెఱుంగుమీ. ౩౯౭

వ॥ అం దగస్త్యి బాల్యమ్మునన తపమ్మునకు వనంబున కరిగె వసిష్ఠుని నిక్ష్వాకుండు గైకొని కులార్థమ్ముగాఁ బాలించుచుండె నిది వసిష్ఠ గేహాంతరప్రాప్తి నావుడు జనమేజయుండు నిమి యేమయ్యె నుడువు మన వ్యాసుం డిట్లను. ౩౯౮

క॥ కనియె మఱియొక్క దేహం, బును వైళమ యవ్వసిష్ఠముని నిమిభూపా, లున కట్లు కలుగదాయెన్, విను జనవర? దీనివిధము విస్తృతఫణితిన్. ౩౯౯

వ॥ అట్లు వసిష్ఠుండు నిమికి శాపం బిచ్చినఁ గ్రతువర్థం బే తెంచి నఋత్విజు లెల్లరుం గలసి యిట్లు యోజించిరి. ౪౦౦

క॥ విపరీత మయ్యెఁ గార్యం, బపూర్ణదీక్షుండు నృపతి యన్యాయము గా, శపియింపఁ బడియె దేహం, బపగత మగు నింక దీని నాఁగఁ దరంబే. ౪౦౧

వ॥ అవశ్యమ్ముగఁ గాఁదగుకార్యమ్ముల నొకండాఁగ నేర్చునే? య

ని చింతించి మంత్రశక్తిచే నతని దేహంబు కించిచ్ఛ్వాసనయుక్తంబగున ట్లు కాపాడి క్రతుసమాప్తి యొనరించుటయు. ౪౦౨

నిమికి దేహాంతరప్రాప్తి.

ఆ॥ వె॥ క్రతుసమాప్తియందుఁ గ్రతుభుక్కు లరుదెంచి, జీవమాత్రశిష్టు భూవరేణ్యుఁ, గాంచి పలికి రధిప! కావించె నీజన్న, మెంతయేని మాకు సంతసంబు. ౪౦౩

క॥ వర మీఁగ వచ్చినారము, నరదేహమునందు వాంఛనాటునొ లేదే సురదేహము వాంఛింతువొ, నరవర! తెల్పుమన నిమియు నాకుల కనియెన్. ౪౦౪

క॥ కాయం బెన్నఁటికేని న, పాయముగను దాని గోర నఖిలజగద్ద్రష్ట్యాయతనమ్ముల నెప్పుడు, వాయువనై యుండఁ బొంటె వాంఛింతు నొగిన్. ౪౦౫

వ॥ అని పలుకునిమియాత్మం గుఱిచి దేవత లిట్లనిరి రాజా! స ర్వేశ్వరి యగుజగదంబం బ్రార్థించితివేనిఁ ద్వత్కృతమఖసంతుష్ట యగునప్పరశక్తి నీవాంఛితం బొసఁగు. ౪౦౬

చ॥ అని సురలానతీఁగ నిమి యాత్మ జగజ్జననిన్ విశేష భ క్తి నెగడ గద్గదస్వరము గీల్కొన సన్నుతి చేయఁ గోటి సూ ర్యనిభసురూప మొప్ప జగదంబిక గోచరమై వరంబు గై కొను మన నెల్లదేవతలకున్ ముద మబ్బురముగ్ జెలంగఁగన్.

వ॥ అంత నిమి యు వినయమ్మున నిట్లను.

క॥ ఈ నెంచెదని వరమును, జ్ఞానం బప్రతిహతమ్ముగా నొసఁగియు ద్ర ష్ట్రానమ్ములువాసమ్ములు,గా నిడుమీ సకలభూతిగణములయందున్

వ॥ నావుడు జగదంబ యిట్లను.

ఆ॥ వె॥ జ్ఞాన మబ్బునీకుఁ గర్మావశేషప, ర్యంత మఖిలభూతరాశి నేత్ర వాస మొదవు నిమిషవర్తన నీనిమి, త్తముగ నేత్రములకుఁ దగు నృపాల. ౪౦౮

క॥ విను పశుపక్షులు మనుజులు ననిమిషు లనిమిషులు సుర లొసం
గితి నీకో, ఇనవర మని జగదంబిక, చనియెన్ దనయంత నిమియు
సంతస మందెన్. ౪౧౦

వ॥ పదంపడి మునులందఱును నిమిదేహ మ్మొక్కెడ నునిచి పుత్రోత్పత్తికై యొక్క యరణిం దెచ్చి మథించిన నవ్వారిమంత్రబలమ్మున సమస్తలక్షణమ్ముల నిమి కెన యగునొక్క కుమారుం డుద్భవించి యతం డరణీమథనమ్మున నుద్భవిల్లుటం జేసి మిథియనియు జనకుని వలనఁ బొడముకతన జనకుం డనియు నెగడె. ౪౧౧

క॥ నిమిదేహం బెడలునిమి, త్తముగఁ దదన్వయమునందుఁ దగియెవిదే
హా, ఖ్యమనుజపతులకనూచా, నముగ నపార్థకముగాకనరపాలమణీ.

వ॥ పిమ్మట నిమిసుతుం డగుజనకుండు ప్రథితుండై గంగాతీరమ్మున మిథిలయను నొకపురంబు ధనధాన్య గోపురాట్టాలాది నిఖిలసంపత్సమృద్ధంబు రచింపం జేసి యందు సుఖం బుండె. ౪౧౩

క॥ జనకునియన్వయమందున్, జనన మ్మందినయశేషజనపాలకులున్
జనకులనఁ బరఁగి జ్ఞానమ్మునకుం దానకములగుచుఁబొలిచిరి పేర్మిన్

వ॥ ఏతద్వంశజుల కెల్లరకును విదేహజనకనామంబులు చెల్లుచుండు నిది నిమిచరిత్రం బనవుడు జనమేజయుండు వ్యాసుం గాంచి మహాత్మా! వసిష్ఠుండు గురు వగుకతనఁ దన్ను శపించినం జెల్లుఁగాక తాను శిష్యుండును శుభప్రద మ్మగుదేవీమఖమ్మునకుఁ గర్తయునై క్షమ దలంపక బ్రహ్మపుత్రునకు వసిష్ఠునకు శాపంబీఁదగునే యనుడు సాత్యవతేయుం డిట్లనియె. ౪౧౪

క॥ తెలిపితి నజితేంద్రియులకుఁ, గలుగదు దేహులకు శాంతి క్షమగ
లమహానీ, యులు దుర్లభు లిల సన్న్యా, సులయుం దేనియును శాం
తి చొప్పడ దనఘా. ౪౧౫

ఉ॥ ఆఁకలి దప్పియు న్విడిచి యన్నిసుఖమ్ములు వీడి యోగినై
తేఁకువ నొప్పఁగాక తెగఁ దెంపఁగ లేఁదు మనోగతంబులొ

- ప్రాకృతశత్రువర్గములఁ బ్రాపించవసత్త్వము? యట్టివాని నీ
లోకమునంద కాదు సురలోకమునందును గాన రాదుగా. ౪౧౬

వ॥ బ్రహ్మపుత్త్రులైన మహాముసీంద్రులును గుణత్రయావిద్ధులై యున్నవా డన్యుల నెన్న నేల? ముందు యోగాభ్యాసరతుండును సాంఖ్యవేత్తయు నగుకపిలుండు దైవయోగమ్మున సగరాత్మజుల దహించె నొక్కం డన నేల? హరిహరబ్రహ్మ లాదిగ సకలమ్మును నహంకార కలితం బని యెఱుంగు మహంకారోత్పన్నం బగుజగమ్మునఁ దద్విరహి త్వమ్ము దుర్లభంబు. ౪౧౭

క॥ ఒకవేళ సత్త్వవృద్ధియు, నొకవేళ రజోధికతయు నొకవేళఁ దమః ప్రకటతయుఁ గలుగు గుణముల, కకలంకత నొక్కరీతి యలవడ దనఘా. ౪౧౮

వ॥ అగుణుండును నవ్యయుండును బరముండును నిర్లేపుండును సర్వభూతాంతర్యామియు నగువాఁ డొక్కపరమాత్మ, మఱియుఁ బరశక్తిగను నట్టిద, ఈయిరువురకు నెల్లవేళ నైక్యం బని యెఱుంగునది.

క॥ పరమాత్మకుఁ బరశక్తికి, నరయ నభేదంబు నెవ్వఁ డాతఁడు ముక్తిం, బొందు నఖండజ్ఞానస్థిరుఁ డగు నిది యెఱుఁగు వేదసిద్ధాంతముగా. ౪౨౦

క॥ జ్ఞానంబు రెండు తెఱఁగులు,గా నెఱుఁగు మొకఁడు శాబ్దికమ్మది వేదాధీనమ్మును శాస్త్రార్థాధీనంబును నై జనించుఁ దెల్లం బధిపా. ౪౨౧

వ॥ శాబ్దికజ్ఞానమ్మున మతికల్పితమ్ము లగువికల్పమ్ము లనేకమ్ములు వొడము నింక రెండవది యనుభవం బనం బడు నట్టిజ్ఞానం బెరికి దుర్లభంబు. ౪౨౨

క॥ ఘనుఁడైన వేత్త దొరకిన,ననుభవమున ననుభవముగలుగు సకలతమమ్ముఁ దునుకొని యడంచు నయ్యది, జనవర! తమ మడఁప లేదు శాబ్దిక మెందున్. ౪౨౩

ఆ॥ వె॥ అదియు కర్మ మెద్ది యడఁచు బంధమ్ముల, నదియు సిద్ధ ముక్తి

కమరు నెద్ది, శాబ్దికంబు తమమునంహరింపదు దీప, మన్నమాత్రఁ
దిమిర మడఁగు నెట్లు. ౪౨౪

క॥ పరహితమును గోపమ్మున్, బొరయమి ధృతి యోర్పు శీలమును సం
తోషం, బరయుఁగ విద్యకు ఫలములు, నరవర! ఫల మనఁగ రాదు
నైపుణి యొందున్. ౪౨౫

వ॥ యోగాభ్యాసమ్ముననొండె విద్యాభ్యాసమ్ముననొండెఁగామాది
నాశం బలవడ దయ్యావి మనోజాతంబులగుటఁ దజ్జయమ్మునఁ గాని లోఁ
బడవు. ౪౨౬

క॥ మనము జయింపనికతమున, మునిపై నిమిభూవరునకు మొనయదు
శమ మ్మ,య్యనఘుఁడు యయాతి మును శు, క్రునకున్ బ్రతిశాప
మీఁడు క్రూరుఁడు గామిన్. ౪౨౭

క॥ భృగుపుత్రునిశాపమ్మునఁ, దగ జర గ్రహియించె నెంత ధార్మికుఁ
డో యయా, తి గణింప నొక్కఁ డొక్కం, డగపడు సౌమ్యుండు
క్రూరు లందఱు జగతిన్. ౪౨౮

హైహయకృతవిప్రవధ.

చ॥ ఒకనిస్వభావ మొక్కగతి నొప్పెడి దీనికి నింతయేల? ము
న్నకరుణులై ధనాశమెయి హైహయు లాత్మపురోహితుల్ కలా
ప్రకటితు లుత్తమోత్తములు భార్గవులన్ బరిమార్ప లేదె? పా
తకములు క్రోధమూర్ఛితు లెదన్ గణియింప రొకించుకేనియున్.

వ॥ నావుడు జనమేజయుం డిట్లనియె. ౪౩౦

గీ॥ బ్రహ్మహత్య గణింపక భార్గవులఁ బు, రోహితుల నుక్కడంచిరి హై
హయు లని, పలికితివి వార లెవ్వనికులమునందుఁ, బొడమి రేకా
రణము కోపమునకుఁ జెపుము. ౪౩౧

క॥ కారణము లేనికార్యం, బారయ మగ్రజుల రాజు లఘుమెన్నక సా,
ధారణముగఁ జంపుదురే?, వైరం బెంతేని నుండ వలయుమహాత్మా

క॥ బలవంతు లయ్యు రాజులు, బలహీనులఁ బూజ్యు లైనబాడబవరు

లన్, కలుషభయమ్మును జెందక, తల దఱుగుటపాడియగున ధర్మ
ము చెడదే. ४33

వ॥ నా కీసందియం బెడఁ బాపు మనుడు వ్యాసుండు పురాతనక
థ స్మృతికిం దెచ్చికొని యిట్లు సెప్పం దొడంగె. ४3४

చ॥ కలఁడు సహస్రబాహుఁ డధికం బగుశౌర్యము వొల్చువాఁడు ని
స్తులబలశాలి హైహయుఁడు దుర్జయతేజుఁడు కార్తవీర్యభూ
తలపతి ధర్మతత్పరుఁడు దానమునన్ గడుమేటి యాతఁ డ
గ్గలముగఁ జేసె జన్నము లగణ్యముగాఁ దగుభూరిదక్షిణన్. ४3౫

వ॥ అతండు హరియపరావతారం బగుదత్తాత్రేయునిశిష్యుండు
భృగువులకును నట్లయాజ్యుం డగుకతనఁ దా నొనర్చినజన్నమ్ములం
దొసఁగినధనమ్మున వార లతిధనికులై హయాదిసంపన్నులై చెలంగు
చుండిరి పదంపడి కార్తవీర్యార్జునుండు కొండొకకాలమ్మునకు దివం
బేగుటయుఁ దద్వంశ్యు లగుహైహయులు ధనహీనులై తదర్థంబు త
మగురువు లగుభృగువుల యాచింపం జనిన వారలు ధనలుబ్ధు లగుకతన
నీ నొల్లక కొందఱు పాఁతిపెట్టియుఁ గొందఱు బ్రాహ్మణులకొసంగియు
మఱికొంత తెచ్చకేనియు డాఁచియు రాజభయమ్మునఁ బలాయితులై
యెక్కపెట్ట దుర్గమంబు లగుగిరిగహ్వరమ్ము లాశ్రయించి రంత హై
హయులు వారలగృహమ్ము లన్నియు వెదకి యెక్కరు నేనిం గానక ధ
నార్థంబు భూఖననం బొనర్చుటకు నుంకించిరి. ४3౬

క॥ భృగువులయుఁ జుట్టుపట్లన్, దగువిప్రులయు సదనములు త్రవ్విన
ద్రవ్యం, బగణితముగఁ గన్పడె భీతగతిన్ శరణంబు గొనిరి తద్గత
విప్రుల్. ४3౭

ఆ॥వె॥ శరణుఁ గనినవారిఁ జని గిరిగహ్వర, మ్ములను డాఁగువారిఁ బొ
లియఁజేసి, రెల్లభార్గవుల నహీనకోపమ్మునఁ, బట్టి, దొరకినంతవట్టు
నధిప. ४3౮

శా॥ ఆగర్భమ్మును ధారుణిం దొలిచి ద్రవ్యం బంతయుం గూర్చి భూ

భాగంబెల్లెడ గర్భముల్ గొలిపి చంపం జొచ్చి రాబాలమున్
స్త్రీగర్భంబులు పాడు చేసి భృగులన్ దీవ్రాస్త్రముల్ చొన్పి; యెం
తే గర్గోలగ నేర్చి రంగనలు కన్నీరేఱులై పాఱఁగన్. ౪౩౯

వ॥ అట్టి ఘోరకృత్యమ్మునకు సహింపక సమీపతీర్థవాసు లగుము
ను లేతెంచి హైహయుల కిట్లనిరి. ౪౪౦

చ॥ విడువుఁడు బ్రహ్మజాతి నిటు వీరులరై పొలియింపఁ జెల్లునే?
యిడుములు మాకున్ గటా! వనితలూరకె తల్లడిలంగ గర్భముల్
వ్రాలుచునుండు పాపియే? నృపులపోఁడుములే యివి; యింత పాపమున్
దడఁబడ కాచరించెదరు తప్పక తప్పుల మిద్ద కన్పడున్. ౪౪౧

వ॥ అనుమునులకు హైహయు లిట్లనిరి. ౪౪౨

ఉ॥ మీరు మహానుభావులరు మిన్నక వీరలు మాదుపూర్వులం
జేరి ఛలమ్మునన్ ధన మశేషము గైకొని దాఁచి పెట్టిరీ
చోరులఁ జంపఁ బాతకము చొప్పడునే? బకవృత్తులన్; ఋణం
బీరఁట? పాదవృద్ధి; కిపు డేమొక కార్యము చేయఁ గోరినన్. ౪౪౩

క॥ దాత యగు కార్తవీర్యుఁడు, పాఁతులు వైచుకొన ధనము పంచి యి
డెనె! మీ, కేతాదృశ మగుకృత్యము, చేతఃప్రీతికర మగునె? చెప్పుఁ
డు మానుల్. ౪౪౪

చ॥ క్రతువులొనర్చి యెక్కుడగు కార్యములం బొనరించి నిత్యరి
క్తతతికి నిచ్చి సౌఖ్యముగఁ దా భుజియించి ధనంబు విప్రుఁడీ
గతిఁ దగ వెచ్చఁ బెట్టవలెఁ గాకునికి న్నృపచోరవహ్నిసం
గత మయి వమ్ముగన్ విడుచుఁగా? యది ఱుకు నెన్నిభంగులన్-

గీ॥ అట్లు కాదేనిఁ దాఁ దాఁచినట్టిధనము, నొరుల కీక భుజింపక యు
న్నకతనఁ, జచ్చిపరలోకమున కేగి జమునియాజ్ఞ, నరకసంగతుఁ డ
గు ధననాయకుండు. ౪౪౬

క॥ దానము భోగము నాశము, నా నెగడున్ మూఁడుగతులు నరు లా

రెంటిన్, మానిన మూడవగతిచే, దా నడఁగు ధనంబదెంత దాఁ
చినయేనిన్. ౪౪౭

గీ॥ ఏము పాదవృద్ధి నీ నెంచి మాపురో, హితుల వినయ మెసఁగ ఋ
ణము నడుగ, నీఁ దలంప రిట్టిహీనులు రాజుల, మైనమాకు దండ్యు
లగుట తప్పె. ౪౪౮

క॥ కృపణు లదాత లభోక్తలు, నెపమున నార్జించువారు నేల నిడెడివా
రుపకార శూన్యులున్ భూ, మిపతులకున్ దండ్యు లనుట మీా రె
ఱుఁగని దే. ౪౪౯

వ॥ అట్లగుట వంచకులును బ్రాహ్మణాధములును నగువీరల దం
డించుటకు మహాత్ము లగుమీారలు క్షమియింప వలయు నని యమ్మా
నుల నెట్టకేలకు నొప్పించి భృగుపత్నులగర్భమ్ములు పగుల్చుచుండ స
య్యంగన లందఱును దుఃఖార్తలై హిమవత్పర్వతమ్మున కరిగిరి. ౪౫౦

గీ॥ హైహయులచేత ధనలోభ మమర విప్రు, లిట్లు హతు లైరి యె
వ్వారికేని లోభ, మెక్కు డగుశత్రు వద్దాని నెనయువాఁ డొ, న
ర్పఁగా రానిపనులు భూనాథ? లేవు. ౪౫౧

చ॥ కులము నశించు ధర్మమునకుం జెఱుఁ దల్లినిఁ దండ్రి నాత్మజా
తుల హితులన్ గురూత్తములఁ దోఁ జనియించినయన్నదమ్ములన్
లలనలఁ జుట్టలన్ మదిఁ దలంకక చంపఁగఁజాలు లుబ్ధుఁ డా
తులువకుఁ జేయరానిపని దోఁపదు ముజ్జగమందుఁ జూచినన్. ౪౫౨

గీ॥ కామమునకన్నఁ గ్రోధమ్ముకన్న నెక్కు,డైనశత్రు వహంకృతికన్న
లోభ, మదిగలుగువాఁడు ప్రాణమ్ము లైన విడుచు, నన్న నవ్వాఁ
డొనర్పని దన్య మున్నె. ౪౫౩

ఉ॥ నా జనమేజయుం డను ఘన మ్మగుసీవచనామృతంబునె ం
తేఁ జవి గొన్న నించుకయుఁ దృప్తి యొసంగదు భార్గవాంగనల్
రాజభయమ్ము వీడుటయు బ్రాహ్మణవంశమువృద్ధియున్ మునీం
ద్రా? జనవంద్య? నాకుఁ గృప నానతి యిచ్చి కృతార్థుఁ జేయవే.

వ॥ నాపుడు వ్యాసుం డిట్లను రాజేంద్రా! హైహయపీడిత లై భృగువనిత లట్లు హిమవంతమ్మున కరిగి యచ్చట నృణ్మయం బగు గౌరీవిగ్రహం బొనర్చి సరిత్తటమ్మున నిల్పి యుపోషణపూర్వకమ్ముగఁ దత్పూజల నొనర్చుచు మరణమ్మునకుఁ గృతనిశ్చయ లై యున్నంత. ౪౫౫

క॥ ఒకరాత్రికాలమున దే, వి కృపావతి యగుచుఁ జానువేషిణ యై వా, రికి స్వప్నమందుఁ బ్రీలో, నొక తెకు నూఁజుఁడు పురుషుఁ డుద్భవ మందున్. ౪౫౬

క॥ వినుఁ డతఁడు మామకాంశం, బున వాఁ డగు కతన శక్తి పూర్ణుం డై మి, మ్మును బ్రోవఁ గలఁడు నమ్ముం, డని చెప్పి తనంత నరిగె నంతట వారల్, ౪౫౭

వ॥ మేలు కాంచి సంతోషదంతురితాంతరంగ లై యున్నంత నందొక్క వనిత యూరువుచే గర్భమ్ము ధరియించి క్షత్రియభయమ్మున నెందేఁ బోఁ దలంచి పలాయనం బొనర్చుచున్న యది రాజులచేఁ జూడంబడి ఖడ్గపాణు లై తన్ను వెనుకొనువారికిఁ దలంకి గర్భరక్షణార్థం బాక్రోశించుచు నిరాధార యై సింహగృహీతయు గర్భిణియు నగు హరిణిం బోలి కుందుచున్నంత. ౪౫౮

## ఔర్వోత్పత్తి.

క॥ తనతల్లి దీనదశఁ దాఁ, గని సైఁపక యూరువుం బెకల్చుకొని తటా, లున శిశువు వెలికి వచ్చెన్, దిననాథుం బోనిమేటి తేజము వెలయన్.

క॥ ఆచిన్నిశిశువు తేజము, చూచి సతత్క్షణమునంద చూడ్కులు సెడి యా, రాచజనమ్ములు గిరులన్, ధీ చెడ జన్మాంధు లనఁ గఁదిరిగిరి భూపా.

వ॥ అట్లు తిరుగుచు వార లందఱు నొక్కెడకుఁ జేరి తమమనమ్ముల నాశ్చర్యంబును దైన్యమ్మునుం బొడమ నిట్లు యోజించిరి. ౪౬౧

క॥ బాలకుఁ జూచినయంతన, యేలొకొ నేత్రములు వోయె నిండఱకుం దద్బాలకుమహిమమొ లేకా, లీలావతివ్రతముపెంపొ లేక మతేమొ. ౪౬౨

వ॥ అని చింతించి బ్రాహ్మణపరిభవం బకార్యం బని యెంచి హై
హయులు మెల్లమెల్లన నామె యున్నెడ కరిగి తమభయమ్మున వడం
కు నాబ్రాహ్మణికిఁ గృతాంజలులై శరణంబు వేఁడుచు నిట్లనిరి. ౪౬౩

ఉ॥ అమ్మ? నినుం గనుంగొనినయంతన కన్నులు వోయె నీచరి
త్రమ్ము నుతింపఁగా వశమె గ్రక్కున మమ్ము ననుగ్రహించి నే
త్రమ్ముల నీఁ గదమ్మ? దయ దప్పుట పాడియటమ్మ? దృగ్విహీ
న మ్మనుజీవనమ్ము మరణమ్మున కెక్కుడు గాదె యేరికిన్. ౪౬౪

ఆ॥ వె॥ ఇంక నిట్టికర్మ మేమొనర్పము భార్గవులకు సేవకులము తెలి
సి తెలియ. కాచరించినట్టియఘము క్షమించి కన్నుల నొసంగు
మమ్మ? యెలమి మాకు. ౪౬౫

వ॥ ఇది మొదలు భృగువులయెడ హైహయు లందఱును వై
రంబు విడిచి వర్తించునట్లు శపథం బొనరించెదము, నీవును బుత్రుండును
సుఖం బుండం గలరు మ మ్మనుగ్రహింపు మనుడు వారలకు నాబ్రా
హ్మణి విస్మయంబు గదుర నిట్లనియె. ౪౬౬

ఉ॥ మీనయనమ్ము లే నెఱుఁగ మీపయిఁ గోపము లేదు నాకు ను
త్పన్నుఁడు బంధుఘాతుకుల దుష్టుల మి మ్మిటు చేసె నక్కటా?
కానక మంచిచెడ్డల నకారణ మర్థపరత్వ మూని వి
ద్యానిధు లైనతాపసుల నట్లొనరించిన రిత్త వోవునే. ౪౬౭

క॥ గర్భగతు లైనశిశువుల, నర్భకులన్ వృద్ధులన్ దయాశూన్యత సం
దర్భ మెఱుంగక చంపిన, నిర్భాగ్యుల మి మ్మడఁపజనించె నితఁడొగిన్

ఆ॥ వె॥ ఊరుగర్భుఁ డగుచు నుండెను శతవత్సరమ్ము లితఁ డాగమమ్ము
లెల్ల, నపుడు సంగ్రహించె నంబాకటాక్షమ్ము, కతన నాకుఁ గొడు
కు గా జనించె. ౪౬౮

గీ॥ పితృవధమ్మున మిగులఁ గోపించియున్న, వాని వత్సుతు నొక్కన
వంధ్యభక్తి, వేఁడికొని వేఁడి మాన్పుఁడు వేగమీరు, నేత్రములు గ
ల్గు నింతయు నిక్క మనుడు. ౪౭౦

వ॥ వార లందఱును వినయసంభ్రమమ్ము లిగురొత్త మునివ
రుం డగునాయౌర్వు సన్నుతించినఁ బ్రసన్నుండై యతం డంధులగు
హైహయుల కిట్లనియె. ౪౭౧

గీ॥ దేవనిర్మితములు తప్పి పోవు నెట్లు, వాని కొక్కింత తజ్జ్ఞుఁడు వగవఁ
బోఁడు, ఋషుల కిఁక సౌఖ్య మబ్బెడి దృష్టు లెప్పఁటిగతి మీకుఁ
జెలంగు నరుగుఁడు కదలి. ౪౭౨

వ॥ అని యౌర్వుం డనుగ్రహించుటయు.

ఉ॥ ఆతనియాజ్ఞ నొంది నృపులందఱు నెప్పటియట్ల లోచనో
పేతత నేగి రక్కొమరు నెంతయుఁ బేర్మి గడల్కొనంగఁ ద
న్మాత గ్రహించి యాశ్రమమునన్ దగఁ బెంచుచునుండె నర్థకా
మాతురు లైన హైహయు లకైన పరాభవమున్ గ్రహించితే. ౪౭౩

వ॥ నావుడు జనమేజయుం డిట్లనియె.

గీ॥ భారతులకెల్ల భరతునిపగిది యాదవులకు యదునృపునట్ల వీరలకు
లమున, హైహయుం డనునొక్క రాజలరెనే? ము, నీంద్ర? లేకున్న
హైహయు లెట్టు లైరి. ౪౭౪

వ॥ నావుడు వ్యాసుం డిట్లనియె రాజేంద్రా? సూర్యపుత్రుం డ
గు రేవంతుఁడనువాఁ డొక్కనాఁ డుచ్చైశ్రవమ్ము నధిష్ఠించి భగవద్దర్శ
నాకాంక్షియై వైకుంఠమ్మున కరిగె. ౪౭౫

## హైహయవంశము.

క॥ లచ్ఛియు నన్న యయినయ, య్యుచ్చైశ్రవముఁ గుమారు నూర
క కోర్కెల్, పెచ్చుపెరుఁగ సంస్తంభన, మచ్చుపడం జూచుచుండె
నాలో హరియున్. ౪౭౬

ఆ॥ వె॥ హయము నెక్కి వచ్చునతిమనోహరుని రే, వంతుఁ గాంచి వి
స్మయాంతరంగుఁ, డగుచు భాగ్య కిట్టు లనియె ‹‹నోచార్వంగి!, యె
వ్వఁ డొక్కొ గుఱ్ఱ మెక్కి వచ్చె. ౪౭౭

వ॥ భువనత్రయమోహనుం డగునివ్వాని నెఱుంగుదే? యని మాటిమాటికి నడిగినఁ దన్మయచిత్త యగునక్కోమలి ప్రత్యుత్తరం బీ నేరదయ్యె నంత నతండు మోహితఁగా నాపె నిశ్చయించి కోపాకులుండై యిట్లను. ౪౭౮

చ॥ విను మిఁక నేమి చూచెదవు? వేఁదుఱు వట్టినదానిభంగి; నీ
మన మవశత్వముం బొరసె మానిని? యీహయదర్శనమ్మునన్
జనువున నెల్లెడన్ రతి నెసంగుటచే రమ్నవై చలత్వ మూ
నినకతనన్ జలాఖ్య వయి నెట్టన నీ వపకీర్తి నొందుమా. ౪౭౯

గీ॥ ప్రాకృతాంగనవోలె ధైర్యమ్ము విడిచి, హయముఁ గామించి చంచలవైతి కాన, బడబవై మర్త్యలోకసంభవము చెందు, మనుడు శాపమ్మునకు భీతి నంది రమయు. ౪౮౦

ఉ॥ శోకము పెల్లుగాఁ గ మధుసూదనుపాదయుగంబు శీర్షమున్
సోఁకఁగ మ్రొక్కి దీనదశ చొప్పడ నిట్లను దేవదేవ? న
న్నీకరణిన్ శపింతె? కృప యించుక లేదె? స్వభావసిద్ధమై
నాకడ నుండుపేర్మియు వినాశము చెందెనె? యింతమాత్రలో. ౪౮౧

క॥ ఎన్నండుఁ గోప మెఱుఁగక, వెన్నవలెఁ జెలంగునీదువిధ మింతటిలో, నన్నగిలి క్రొత్త యగునే?, చన్నే? న న్నిట్లు శాపసంగతఁ జేయన్. ౪౮౨

క॥ నిను విడనాడి బ్రతుకనే, ర్తునె ప్రాణము లిపుడ దొరఁగుదు న్నీ శాప,మ్మున కంతమ్ము గృపామతిఁ, గని చెప్పు మనంగ నతఁడు కరుణార్ద్రుండై. ౪౮౩

ఆ॥ వె॥ వినుము నీదుగర్భమున నాకు నెన యగు, పుత్రుఁ డొక్కరుండు పుట్టునెప్పు, డపుడ శాప మోక్ష మగు నన్నుఁ బొందంగ,నబ్బు నీకు నిక్క మబ్జవదన. ౪౮౪

వ॥ అనవుడు జనమేజయుం డిట్లనియె.

గీ॥ కాలయోగమ్ముకతన నిక్కరణి శాప, మంది ప్రోషితభర్తృకచంద

మొంది, బడబయై యొంటిదనుకఁ దా నిడుము పడసె, నెట్లు సంతాన
మును గని యేగెఁ బిదప. ౪౮౫

క॥ నావుడు వ్యాసుం డిట్లను, రేవంతుం డబ్జనాభురీతిం గని కో, పావి
ష్టుం డని భయపడి, వేవేగ నమస్కరించి వెలువడి యంతన్. ౪౮౬

క॥ తనతండ్రి సన్నిధికిఁ జని, వినయమునన్ గడచినట్టివృత్తాంతమ్మున్
మునుకొని నుడివె రమయు న, వ్వనరుహలోచనునియాజ్ఞ పడసి
వగ దగన్. ౪౮౭

సీ॥ చని మున్ను రవిభార్య ఘనతపమ్మున నున్నచోటునఁ దమనయు
సూర్యపుత్రి, గలిసినయెడ సర్వకామప్రదస్థానమున సుపర్ణాక్షునం
జ్ఞను బొగడ్డ, దవిలిసదానికుత్తరమున శోభనకాననమ్ముల నొప్పు
గన్న యెడల, బడబయై శంకరుఁ బంచాస్యు దశభుజుఁ జంద్రశేఖ
రు గజచర్మవసను. గీ॥ నీలకంఠుఁ ద్రిలోచను నిఖిలకామ, దాత న
వదాతవిగ్రహు ధరసుతార్ధ, దేహుఁగుఱిచి తపమ్ము నుదీర్ణవృత్తి, దివ్య
వర్షసహస్రమ్ము దివిరిచేసె. ౪౮౮

వ॥ తత్తపమ్మునకు మెచ్చి యద్దేవుండు పార్వతీసహితమ్ముగ వృ
షభారూఢుండై ప్రమథగణమ్ములు గొలువఁ బ్రత్యక్షుండై బడబారూ
పిణి యగుహరివల్లభ కిట్లనియె. ౪౮౯

ఉ॥ ఏల తప మ్మొనర్తు? జగదీశ్వరి? నన్ను గుఱించి దేవి? ని
న్నేలెడువిష్ణు వన్నియును నీఁ దగునట్టిసమర్థుఁ డక్కటా?
బేలవె? భర్తఁ దక్కియు వివేకిని కింకొకదైవ ముండునే?
స్త్రీలకు నెట్టిదైనఁ బతి సేవ్యుఁడ కాఁడె? త్వదీశుఁ డల్పుఁడే. ౪౯౦

చ॥ అనవుడు లచ్చి యిట్లు లను నంతయుఁ దథ్యము శాప మిచ్చె న
వ్వనరుహనేత్రుఁ డయ్యది కృపామతివై యెడఁ జేసి యుద్ధరిం
ప నిను యాచించితిన్ దగఁ దపమ్మునఁ;""బుత్రుఁడు గల్గు మీఁదఁబో
వు,,ననియె శాప మెక్కడణిఁబుట్టునుతుండు మహాత్మ! చెప్పవే. ౪౯౧

క॥ వైకుంఠమ్మున నాపతి, యీకాననమందు నేను నివురకును నే

లాకల్గుఁగూడియుండుట, యేకత లేకున్నఁ బుత్రు డెట్లుదయించుఁ.

ఉ॥ నాదుతపమ్ముసేఁతకు మనమ్మున మెచ్చితివేనిఁ గామితం
బీఁ దగు నీకు నాపతికి నించుకభేదము లేదు దీని ము
న్నాదరరీతి నాదయితుఁ డానతియిచ్చెఁ దదాది మీకు నే
భేదము చూడ నిట్టినిను వేఁడుట యాతని వేఁడుటే కదా. ౪౯౩

గీ॥ అతఁడ నీవు నీవ యతఁ డని యెఱిఁగిన, దానఁ గాక నిన్నుఁ దలఁ
తునేని, నాపతీత్వమునకు దోసమ్ము గల్గు న,నంగ మెచ్చి యయ్యె
నంగరిపుఁడు. ౪౯౪

ఉ॥ జ్ఞానులు వేదవేదులు నకల్మషు లౌమునులుఁ నిలింపులుఁ
గానఁగ లేక తర్కములఁ గాలము వ్యర్థ మొనర్తు రేక్రియం
దీని నెఱింగి తీవు వినుతింపఁ దగుఁ గదు నీవివేక మెం
దేనియు నంగనాజనుల కింతటిబుద్ధి విశేష మొప్పునే ౪౯౫

క॥ హరిభక్తులు నను నిందిం,తురు మద్భక్తులతినిందితుం జేయుదు రా
హరి;నించుకేని మాయం,తర మెఱుఁగఁగరా దదెట్టితత్త్వజ్ఞులకుఁ

గీ॥ కలియుగమ్మున మాయాభయులకుఁ గల్గు, నేకత నెఱుంగ లేక దు
ర్థికు లజ్ఞు, లింతకన్నను వాదమ్ము లెనయుచుంద్రు, తెలియుదురు
మేటివిజ్ఞాన మొలయువారు. ౪౯౭

వ॥ నీ కీయభేదజ్ఞానం బెట్లు చొప్పడె నెఱిఁగింపు మనుడు శంకరు
నకు లక్ష్మి యిట్లను మహాత్మా! మున్నొక్కనాఁడు మన్నాథుండు మం
తనమ్మున ధ్యానపరుండై పద్మాసనగతుండై యున్నయెడ విస్మితనై యే
నిట్లంటి. ౪౯౮

ఉ॥ మున్ను సురాసురల్ దరగ సముద్రము ద్రచ్చునెడఁ జనించి నే
నెన్ని నినుఁ వరించితి సురేంద్రులకెల్లను మేటి వంచు; నీ
కు న్నళినాక్ష! ధ్యాన మొనఁ గూడుట కేమి నిమిత్త,మెందు నే
ని న్నిను దాఁటువేల్పులు గణింపఁగ లేరుకదా? వచింపుమీ. ౪౯౯

చ॥ అనవుడు నాథుఁ డిట్టు లనె నంబుజనేత్ర! యొకప్పు డేను న
ద్యానిమిషవంద్యుఁ డైనగిరిజాధిపుఁ గొల్తు నొకప్పు డాతఁడు
న్ననుఁ గొనియాడు నాతఁడు మనఃప్రియుఁ డెంతయు నాకు; నేను నా
తనికిని నట్టివాఁడ విను తత్త్వము భేదము లే దొకింతయున్. ౧౦౦

గీ॥ ఎవ్వఁడేనియు నాభక్తుఁ డెఱుక లేక, శంకరుని నిందఁ జేయు నాజ
డుఁడు నరక, మందుఁ బడువాఁడు తద్భక్తుఁ డట్ల నన్ను, నిందఁ జే
సిన నగు నింత నిక్కమనుచు. ౧౦౧

వ॥ నాకున్ బోధించెఁ దదాదిగ నేను మీయిరువురయభేదంబు
నెఱుంగుదాన నన్ననుగ్రహించి నాకు మద్వల్లభుతోడి కూడిక యె
ట్లొనఁగూడు నట్లొనర్పు మని ప్రార్థించుటలచ్చికి మహేశ్వరుం డిట్లనియె.

క॥ చింతింప నేల? నీతప, మెంతే సంతోస మొసఁగె నిఁక నీయెడ సు
స్వాంతుం డగు నీపతి యో, దంతిగమన! నీకు నొక్కతనయుఁడు
పుట్టున్. ౧౦౩

క॥ హయరూపమ్మున శ్రీహరి, దయగలఁడై యిటకు వచ్చి తన్వీరో! నీ
కుం, బ్రియుఁ డగు నా ప్రేరణ న, మ్ముయథార్థమ్ముగను నీకుఁ బుత్రుఁ
డు పుట్టున్. ౧౦౪

ఉ॥ ఆకొమరుండు లోకులకు నందఱకుం దలదాఁటి భూపుఁడై
యేకముగా జగం బఖిల మేలెడివాఁ డయి యేకవీరుఁ డన్
ప్రాకటమైననామమునఁ బ్రాభవ మొప్పఁ జరించు హైహయా
ఖ్యాకము వంశము న్నెగడఁగాఁ గల దాతఁడు కారణమ్ముగన్. ౧౦౫

వ॥ పిమ్మట నీవును భర్తంగూడి వైకుంఠమ్మున కరిగి సుఖంబుం
డఁ గల వని చెప్పి మఱియును. ౧౦౬

గీ॥ హృదయగత మైనపరశక్తి నెఱుకకలిమిఁ, గొలువ నేరక మత్తఁ
గొనిసకతన, నీకు నిట్లబ్బె శోకంబు నిజము దీని, శాంతి కిప్పుడ
యద్దేవి శరణు సొరుము. ౧౦౭

చ॥ అని వరమిచ్చి శంభుఁడు తనంతఁ జనెన్ గడుభక్తి నజ్జగ
జ్జననియు నంతరాత్మ విలసత్సురదైత్యశిరోవిరాజినూ
తనమణికాంతిరంజితపదద్వయభాసినఖన్ మహేశ్వరిన్
వినయమునం దలంచుచును వేడ్క మెయిం బతిరాకఁ గోరుచున్.

వ॥ ఉన్నంత శంకరుండు కైలాసమ్మున కరిగి ప్రమథులయందు నొక్కరుం డగు చిత్రరూపునిఁ జూచి యిట్లనుచు. ౧౦౯

క॥ వైకుంఠమ్మునకుం జని, శ్రీకాంతునితోడ నిట్లు చెప్పుము "పత్నీ
శోకమ్ము నుపు" మనుచు మై, త్రీకలనం దనకు నేను దెలిపితి ననుచున్.

చ॥ అని యనుపంగ నేగె నతఁ డంచితవైష్ణవభాసురంబు సు
స్వనశుకహంససంయుతము చారుసరఃకలితంబు నృత్యగీ
తనినదవాసితంబు వితతద్రుమభూషిత మప్రమేయసౌ
ధనిచయమండితంబు నగు తామరనాభుపురంబు వేడుకన్. ౧౧౧

క॥ హరిసదనద్వారమ్మున, స్థిరులై వర్తించుసుప్రసిద్ధుల వేత్రో, ద్ధరపా
ణుల జయవిజయుల, నరసి హరికిఁ జెప్పఁబనుప నంపెట జయుఁడున్

ఆ॥ వె॥ హరిని గాంచి యిట్టులనుఁ "జిత్రరూపుఁ"డన్, దూత శంకరా
జ్ఞచేత వచ్చి, తావిరి దర్శనము ప్రతీక్షించి యుండె రాఁ, దగునె
తగదొ యన నతండు పేర్మి. ౧౧౩

క॥ వైశము లోనికి రమ్మని, కాలగళునిదూతఁ బిలువఁగాఁ దగు నన న
చ్ఛీలుఁ డతఁ డట్లొనర్పఁగ, నాలో నా చిత్రరూపుఁ డంజలిగొనుచున్.

క॥ ఎదుటికిఁ జని మ్రొక్కిడఁ బే. ర్మి దగ "గిరీందు ప్రియకు సేమమే? నీ
విటకుం, గనలియురుదెంచు టెందుల, కొదవముగా? దేవకార్య
మొక్కం" డనుడున్. ౧౧౫

క॥ దేవా! సంసారమ్మున, నీ వెఱుఁగని దొకఁడు గల్గునే! నన్ను మహా
దేవుం డనుపఁగ వచ్చితి, దేవరతో నొక్కమనవి దెల్పి చనంగన్.

వ॥ అతండు చెప్పు మనిన తెఱంగు విన్నవించెద నాకర్ణింపుము.

క॥ నీతరుణి లచ్చి కాళిం, దీతమసాసంగమమున నేమమ్ము మెయిన్
జేతము ధ్యానాయత్తం, బై తగ నున్నది తురంగమాకారమునన్

చ॥ సురముఖసేవ్యయై సకలశోకవినాశిని యైనయేసిరిన్
నరుఁడు త్యజించి దుఃఖకలనం బడు నట్టిచెలిం ద్యజించుసీ
కరయఁగ సౌఖ్యమున్నె? సతి నల్పుఁడునున్ విడ నిచ్చగింపఁ డే
క్కరణి నదోష యంచు మదిఁ గాంచియు భార్యను వీడితో హరీ.

ఉ॥ ఎవ్వనికాంత కష్టి పడు నెగ్గగు నాతనిజీవితం బిసీ!
నవ్వుదు రెల్లశత్రువులు; నాపలుకుల్ విని వైళ వబ్జిజ
న్నెవ్వగఁ బాపి కైకొనుము నెమ్మది సమ్మద మంద నక్కటా!
జవ్వనిఁ బాయుదుఃఖ మది శక్యమె యిట్టి దటంచుఁ దెల్పఁగన్.

మ॥ మును నామానిని దక్షుయాగమున వమ్మం జేసె దేహమ్ము నో
వనజాతాక్ష! తదంగనావిరహసంప్రాప్తంబు దుఃఖంబు నా
కనుభూతంబగుటన్ మఱొక్కనికి భార్యావియోగమున్నన్ మనం
బను మోదింపదు కష్ట మింతకును నన్యం బేది సంసారికిన్. ౧౦

ఉ॥ పిమ్మట నద్రిజం దపముపెంపునఁ గొంటి నగాత్మజాతయై
సమ్మతి దక్షపుత్రికయె జన్మము నందుటఁ జేసి; మేటికి
ష్టమ్ములకెల్లఁ గష్ట మకటా! తరుణిం ద్యజియించి యెట్లు ప్రా
ణమ్ముల నిల్పితో! యెఱుఁగ న్యాయమె నీ కిటు లొంటి నుండుటల్.

గీ॥ వేయి సంవత్సరము లాయె వెలఁది వీడి, యేమి సౌఖ్యమ్ము గొంటి
నీవింతకాల, మరుగు మిఁక జాగు సేయక యశ్వరూప, మమర ని
కాంత వసియించునట్టియెడకు. ౧౧

వ॥ అట్లు చని కొమరుం గని భార్గవిసహితుండై స్వస్థానమ్మున
సుఖంబుండు మని శంకరుండు విన్నవింపు మనియె ననుచిత్రరూపుని
పలుకులఁ బ్రేరితుండై యశ్వరూపమ్ము దాల్చి. ౧౩

గీ॥ బడబ యగుసింధుజాతయున్నెడకు నరిగి, కని మనమ్మున విస్మయ
మ్ము సతిఁ దొందె, సతి నీహయరూపుఁ గని విస్మయంబు నందె, ల

చ్చి; సంగతి యిరువుర కచ్చుపడియె. ౧౨౫

## ఏకవీరజననము.

క॥ మదనార్తు లగుచు నిరువురు, పదపడి యిటు లెనయ గర్భభర మా డరగఁ జే, ర్చెఁ దనూజుఁ గనియె రెండవ, మదనుం డనఁ దగిన వాని మది ముద మెనయన్. ౧౨౬

వ॥ పిదప బడబాకృతి యగుసిరికిఁ దాదృశుఁడగుహరియిట్లనియె.

క॥ బడబారూపం బిప్పుడ, విడువుము వైకుంఠమునకు వేగమ చనఁ గాఁ, గడఁగుట యొప్పదె విడువం, బడుఁగాక తనూజుఁ డిచటఁ బంకజనయనా. ౧౨౭

వ॥ నావుడు లచ్చి కరుణంబున నిట్లను.

క॥ తనువునఁ బుట్టినకొడుకున్, వనమున విడువంగ మనము నచ్చునె యేయుం, గనకైన; నిన్నదితట, మున నీశిశువునకు దిక్కు ముందెవ్వరొకో. ౧౨౮

క॥ అనునాలో నిరువురకును, ననువమ్యోన్ దివ్యదేహ మంత విమాన మ్మును నేగుదెంచె దానిం, గని సిరి హరి కిట్టు లనియెఁ గడుఁ గరుణమునన్. ౧౨౯

గీ॥ సర్వలక్షణముల నీకు సదృశుఁ డైన, శిశువు నిట డిగ విడువ నేఁ జెల్ల నెత్తికొనుము మూఁగుఁరమును నేగు టనువు గాదె, యనుచు హరి యిట్టు లనె సింధుతనయ కెలమి. ౧౩౦

వ॥ ఇబ్బాలకు నే నొక్కకార్యార్థంబు నిర్మించితి నది యెట్లంటేని యయాతికిఁ దుర్వసుం డనునొకపుత్రుండు గలఁ డతనికి హరివ ర్మ యని పితృదత్తం బగునామాంతరంబు విశ్రుతంబగు నారాజన్యుం డు పుత్రకామియై తపం బొనరించుచున్నాఁడు మత్ప్రేరణమ్మున న తం డిత్తనయుఁ బరిగ్రహించి పోషింపఁ గలఁ డతఁడు వచ్చుదనుక నా యానతిం జేసి యీతని కొంచు భయంబు లేకుండు నని యాపె నాశ్వా

సించి తత్సహితుండై వైకుంఠమ్మున కరిగె నావుడు జనమేజయుండు వ్యా
సున కిట్లనియె. ౹౹౩౧

గీ౹౹ జాతమాత్రునిఁ గొమరుని శంకఁ దక్కి, విజన మగు కాననమ్మున
విడిచి చనిన, పిదప సింహాదివ్యాఘ్రములపీక యతని, కబ్బకుండునె?
గతి యెవ్వరైరి చెప్పుమ. ౹౹౩౨

వ౹౹ అనిన వ్యాసుం డిట్లనియె నట్లు లక్ష్మీనారాయణులు విమా
నంబధిష్ఠించి చనినపిమ్మట మదాలస యనుతనభార్యంగూడి ముచ్చటిం
చుచుఁ జంపకుం డనునొకవిద్యాధరుఁడు విమానయానమ్మున దైవవశమ్ము
న నచ్చటికి వచ్చి నిరుపమాన తేజఃపుంజంబై యొప్పునాశిశువు నాలో
కించి విమానమ్ముడిగ్గి మదనసదృశుం డగునక్కొమరుఁ గైకొని మదాలస
కిచ్చిన నత్తన్వియు నిధి గన్న పేదంబలె నమందానందంబు నంది శిరంబు
మూర్కొని యాలింగనంబొనర్చి కన్నవానింబలె నెంచి యుత్సంగమ్ము
న నిడికొని పతి కిట్లను నాథా? యీతఁ డెవ్వండు? ఏ కెట్లు దొరకె? ని
క్కాననమ్మున నెవ్వరు డించి చనిరొకో? యనుడుఁ జంపకుండిట్లనియె

క౹౹ వనితా? యీతం డెవ్వఁడొ, చనియెడి గెద శక్రు; నతనిసమ్మతియేనిం
దనయునిఁగాఁ బెంపందగు,నని వైళము యింద్రునొద్దకాతం డరిగెన్.

గీ౹౹ అరిగి సంతోషదంతురితాంతరంగుఁ, డగుచుఁ బుత్రునిఁ జూపి యి
ట్లను మహాత్మ, యెవనిబాలకుఁడో యితఁడెఱుఁగ రాదు, దొరకెఁ
దమసాతటంబునందు వనమందు. ౹౹౩౪

క౹౹ తమసాకాళిందీసం, గమమున నేవనిత డించి కానుపుపైఁ బేర్చి, మ
ము వీడి చనియెనో ని, క్కము నీసమ్మతినిఁ బుత్రుఁగాఁ గైకొందున్.

వ౹౹ ధర్మశాస్త్రమ్ములు నిట్టిందు గృత్రిమతనయుండుగాఁ జెప్పం
బడుఁ గాదే యనుచంపకునకు నింద్రుం డిట్లనియె, ౹౹౩౬

చ౹౹ ఇతఁడు హయస్వరూపు లగునిందిరకున్ హరికిన్ జనించె న
ప్రతిముఁడు హైహయుం డనఁగఁ బాటిలునీశిశువున్ సృజించె శ్రీ

పతియు యయాతిపుత్రునకుఁ బంపొనరింపఁగ; వేగ విడ్వ భూ
పతి హరిప్రేరణంబు గొని బాలునికై యట కేగు నింతలో. ౧౩౮

వ॥ అతఁ డరుగునంతకు నీవిబ్బాలు నచ్చట విడువవేని యా
రాజు దుఃఖితుం డగు నిబ్బాలుం డేకవీరుం డనునామమ్మునఁ బృథివీత
లమ్మున నెగడువాఁ డగు నని యనిపినఁ జంపకుం డచ్చ్యుతిపావని య
థాస్థానమ్మున డిగ విడిచి తనయెడ కరిగె నంత హరియయాతిపుత్రున
కుం బొడసూపిన నతండు హర్షితస్వాంతుండై నమస్కరించి వినయ
మ్మున నిట్లను. ౧౩౯

గీ॥ విషయసంసక్తి దొరఁగి వివేకవంతు, లైనవారికిఁ గాఁదగునట్టినీదు,
దర్శనము కల్గెఁ బేరాసఁ దవిలి తపము, చేయుచున్నట్టినా కిది చి
త్ర మనఘ. ౧౪౦

వ॥ అని భక్తిపరవశుండై నానావిధమ్ముల నుతియించుచున్నభూ
పాలునకుఁ గృపాలుండు హరి "నీకోరిక" యేమన నతండు "పుత్ర
ప్రాప్తి" యనుడుఁ గమలాక్షుం డిట్లనియె. ౧౪౧

క॥ తమసాకాళిందీసం, గమమున సిరియందుఁ గొమరుఁ గంటిని నీకై
యమలుం డబ్బాలుని గొను, ము మహీశ! యనంగ నతఁడు మో
దముపేర్మిన్. ౧౪౨

క॥ అటఁ జని నోటం దనకా, ల్బొటవ్రే లిడి యాడికొనెడి పుత్త్రుం
గని దు, ర్ఘట మగుతత్సౌందర్యపుఁ, బటిమకు నక్కజము నంది
ప్రబలినకూర్మిన్. ౧౪౩

చ॥ కరముల నెత్తిపట్టి యొసకమ్మున శీర్షము మూర్కొనున్ "సుదు
ష్కర మగుమత్తపమ్మునకుఁ గా నిను శ్రీహరి యిచ్చె" నంచు నా
దరమునఁ గౌఁగిలించుకొనుఁ "దద్దయు సంసృతివారిరాశికిన్
దరణివి గమ్ము నా" కను "సుతా? నినుఁ గన్నది లచ్చియే!" యనున్.

క॥ శతవత్సరములు నీకై, యతితప మొనరించునన్ను నానందింపన్
గతి నైతివి నీనగుమొగ, ము తగం గని పెంచునతివ ధన్య ముచితమే

మ॥ అని మోదించుచు బాలకుం గొని పురం బన్మేటి తా నేగ గా
యనకుల్ వాఁడగ వందిమాగధులు నర్హాస్తోత్రముల్ సేయ నె
క్కొని మంత్రుల్ సపురోహితప్రముఖులై కూర్మిన్ దనుంజూడ లా
జనికాయంబు పురాంగనాజనమణుల్ చల్లన్ ధ్వనుల్ మ్రోయఁగన్

క॥ హారివర్మ యిట్లు తనపురి,కరిగి కొమరు నొసఁగె భార్యకాసాధ్వియుఁ
బ్రే, మరసాకులయై కైకొని, "నరవర! యితఁ డెట్లు దొరకె" నా
నతఁ డనియెన్. ౫౫౫

చ॥ హరికిని నంబుజాలయకు నాత్మజుఁ డీతఁడు నాకుఁ దత్కృపన్
దొరకెఁ దపంబుకల్మి; ననఁ దొయ్యలి సమ్మద మందె మీఁద న
న్నరవరుఁ డక్కుమారునకు నామము వెట్టె మహోత్సవంబు మే
దురముగ నేకవిరుఁ డని; తోరపువృద్ధి నెసంగె నాతఁడున్. ౫౫౬

వ॥ ఇట్లు మహానందరసమగ్నుండై యక్కుమారుకతన ఋణత్రి
యముక్తుఁగాఁ దన్నుఁ దలంచికొని యాఱవమాసమ్మున నన్నప్రాశనం
బును మూఁడవయేటఁ జూడాకర్మ్మును బొనరించి విప్రుల ననేకవిధ
దానమ్ముల సంతుష్టులం జేసి. ౫౫౭

క॥ ఏకాదశాబ్దమందు శు, భాకారున కాసుతునకు నానృపవరుఁ డ
స్తోకము మౌంజీబంధ, శ్రీకము సంస్కార మొప్పఁ జేసి కడంకన్

వ॥ వేదమ్మును ధనుర్వేదమ్మును నభ్యసింపఁ జేసి పట్టాభిషేక
యోగ్యుం డగు నాతనికిఁ బుష్యార్కయోగసంయుక్తంబగుశుభదినమ్ము
నఁ దదనుకూలసంభారంబు లొనరించి వేదశాస్త్రతత్త్వజ్ఞు లగువిప్రుల
రావించి సాగరమ్ములయుఁ దీర్థమ్ములయుఁ బవిత్రజలమ్ములు దెప్పించి స్వ
యముగా నభిషేకం బొనరించి విప్రులకు ధనంబు లొసంగి స్వర్గకా
ముండై భార్యాసహితమ్ముగ నరణ్యమ్మున కేగి మైనాకశిఖరమ్మున వా
నప్రస్థుండై యుండి పత్రఫలాశనాహారనియతిం బార్వతిం గుఱించి త
పం బొనరించుచుఁ జిరకాలం బటనుండి దైవికమ్మున నిరువురును దేహ
త్యాగం బొనరించి యింద్రలోకమ్ము నొంది సుఖం బుండిరి పదంపడి

యేకవీరుం డీయుదంతంబు విని యౌర్ధ్వదైహికమ్ములు నిర్వర్తించె.

క॥ పితృదత్త మగురాజ్యము, హితగతి నొనరించి భోగ మొనయుచు
నొకనాఁ, డతఁ డరిగె మంత్రిపుత్రా, న్వితముగ నమరాపగకు
సమీక్షాపేక్షన్. ౫౬౦

వ॥ కోకిలాలాపముఖరితమ్ములును బుష్పఫలభరితమ్ములును ష ట్పదవిరాజితంబులును నగుపనసచంపకవకుళతిలకతాలతమాల జంబూ చూతకదంబకంబులును వేదధ్వనిమనోహరమ్ములును హోమధూమావృ తగగనమ్ములును మృగశాబసమన్వితమ్ములును నగు ఋష్యాశ్రమమ్ములు ను గోపికానురక్షితమ్ములును శాలిసంపన్నమ్ములును బ్రఫుల్లపంకజారా మమ్ములు నగు కేదారమ్ములును, మనోరంజకమ్ములగునికుంజమ్ములును వే ర్వేరయరయుచు నన్నదియొడ్డునఁ దిరుగువాఁడు ముందట. ౫౬౧

ఉ॥ ఆయమరాపగాజలమునందు శతచ్ఛద మైనయబ్జము
త్తోయజదక్షిణమ్మున విధుప్రతిమాననఁ గాంచనాంగిఁ బ
ద్మాయతనేత్రి దీర్ఘకచ నద్రికుచ న్నవకంబుకంఠి నే
దో యొకచింతమై నొగులుచున్గలి నొంటరిఁ గాంచె నొక్కెడన్.

క॥ కని శోకకారణంబడి, గిన రేంద్రుం డిట్లు పల్కెఁ గేవలమనుజాం
గనవో? గంధర్వివో? నీ,వనిమిషసుందరివో? తెల్పుమా? పే రెవరో

క॥ ఏకాకినివై రోదన, మేకతమునఁ జేయుదాన వెవ్వఁడు జనకుం
డీకాంతవిన్నను నెవఁ, డీకిప్రియుఁ ద్యజియించె నాథుఁ డెవ్వఁడు నీకున్

ఆ॥వె॥ చోరబాధ గాని క్రూరమృగమ్ముల, బాధ గాని నాదుపాలనమున
లేశమాత్రమైనఁ లేదు శోకనిమిత్త, మేమొ తెల్పు దాని నేనడంతు.

క॥ మానవులో దేవతలో, దానవులో? పేరు గ్రుచ్చి తరుణీ? నాతో
మానక తెల్పుము నీదుః,ఖానుగతికి మూల మనిన నచ్చెలి యనియెన్.

క॥ విను నృపవర? నాదుఃఖ, మ్మునకు నిమిత్తము విపత్తి మొనయని
చో నె, ట్లను నగు శోకము ప్రాణికి, మునుకొని వచియించు దీని
మూలంబెల్లన్. ౫౬౨

వ॥ భవద్దేశమ్మున కన్యం బగుదేశమ్మున రభ్యుం డనుమహీనాయకుండు గలఁ డతం డతిధార్మికుం డయ్యానఘుభార్య రుక్మరేఖయనఁ బరఁగు నాపె సంతానహీన యగుకతన దుఃఖితయై యొకనాఁడు తన కాంతున కిట్లనియె. ౧౬౮

## ఏకావళీవృత్తాంతము.

క॥ తనయరహిత మగుమజ్జీ, వనమువృథా యని తలంతు వంధ్యాత్వము
కన్ననుఁ గనఁగనలకు దోసం, బనఘా! వేఱొండు గలదె యగ
యుఁగ సందుఁ. ౧౬౯

వ॥ ఇట్లు భార్యచేఁ బ్రేరితుండై యానృపాలుండు బ్రాహ్మణుల రప్పించి సంతానార్థం బగుక్రతు వొనర్చునెడ. ౧౭౦

ఉ॥ చారుశరీర శీతకరసామ్యమునం దగుమోము వొల్పుభ
వ్యారుణనేత్ర రక్తచరణాంచిత శోభనకేశి కాంచన
శ్రీరుచి నొప్పుకన్నె మృదురీతి నెసంగెడివన్నెలాఁడి యిం
పారఁగ నగ్నికుండమునం దుదయించె నఖండితప్రభన్. ౧౭౧

వ॥ పదంపడి హోత యక్కన్నియఁ దనకరమ్మున గ్రహియించి నృపునకుం జూపి యిట్లను నిబ్బాల*యేకావళినాజనించుటఁజేసి యేకావళీనామమ్మున నెగడుఁ బుత్రితుల్య యగునీపుత్రికం గొని సుఖతుండవగుము విష్ణుఁ డిద్దాని నొసంగె నావుడు రభ్యుం డత్తలోదరిం గొనిసంతుష్టాంతరంగుండై తనభార్య యగురుక్మరేఖ కొసంగిన నాపెయుఁ బుత్రిం గన్నదానిచందమ్మున నామోదించె నంత నృపతి జాతకర్మాదికం బొనర్చి జన్నంబు సమాప్తి నొందించి ఋత్విక్కులం బూజించి తనగృహమ్మున సుఖం బుండె. ౧౭౨

గీ॥ పుత్రివృద్ధి నెసఁగుచు నప్పువ్వుఁబోఁడి, తల్లిదండ్రుల కతులముదమ్ముఁ
గూర్చు, నానృపునమాత్యునకు నేను నాత్మజాత, పేరు వినుము
యశోవతి ధారుణీశ. ౧౭౩

*ఏకావళి, ముక్తావళి.

గీ॥ మాయిరువురకు నీడు సమాన మగుట, నృపుఁడు న న్నొనరించె
నచ్చుపలనేత్రి, కనుఁగునెచ్చెలి గాఁగ; మే మదియుఁగోలె, నొక్క
టిగ నాడికొనుచుందు మొప్పిదముగ. ౫౭౪

క॥ పరిమళవాసితములు మేల్, సరసీజము లెచట నుండు సమ్మతి నచ
టన్, నరవరపుత్త్రికిఁ గ్రీడా,దర మొక్కుడు దానఁజేసి తద్దయు నెమ్మిన్.

వ॥ ప్రతిదినమ్మును నన్నుంగూడి తక్కుఁగల నెచ్చెలులు గోలు
వ గంధవంతంబు లగు పంకజంబులం బోల్పుగంగానదికిం జని య
య్యేకావళి క్రీడించు నియ్యది యతిదూరం బని యే నెంత వారించిన
నాపె చెవిఁ బెట్టకునికి నొక్కనాఁడు తజ్జనకునితో నిట్లంటి. ౫౭౬

క॥ నీకొమిరె ప్రతిదినము క మ, లాకరములయందు వాంఛ నంది సఖు
లతో, నేకతము వనములందు ని, రాకులతన్ దిరుగు నదుల కరుగు
నృపాలా. ౫౭౭

వ॥ నావుడు రథ్యుండు తననగరున భ్రమరమనోహరమ్ములునుబు
ష్పితమ్ములును నగుకమలంబులం బోల్పుతటాకమ్ము లనేకమ్ములు పొందు
పఱచి యేకావళిం గాంచి బుజ్జగించి యిట్లను. ౫౭౮

క॥ అమ్మా? నీకుం గమలవ, నమ్ములయం దిచ్చయేని నవసారసయు
క్తమ్ములగునిచ్చటితటా, కమ్ములఁ గ్రీడింపు మరుగఁగాఁ బోకు మెటన్.

వ॥ అని తండ్రి నియమించినను గమలాసక్తచిత్త యగునక్కన్న
య యథాపూర్వమ్ముగ దూరస్థమ్ము లగునదులయెడఁ గ్రిమ్మరు నయ్య
ది వీక్షించి నృపాలుండు పుత్త్రికయెడఁ గల్గుకూర్మిపెంపున శస్త్రపాణు
లగుభృత్యుల రక్షార్థంబు నియోగించె. ౫౮౦

క॥ ప్రతిదినముం బితృసమ్మతి, నతివలతో నన్నుఁ గూడి యబ్బాలిక ని
ర్గతయై గంగానదికిం, గతాగతములం బొనర్చుఁ గౌతుక మెసఁగన్.

వ॥ అంత నొక్కనాఁడు ప్రాతఃకాలమ్మున సఖీసమేతయై రక్షకు
లు వెంటనరుదేరఁ గ్రీడాపరాణయయ్యై యయ్యేడ కరుదెంచి యింతకు
మున్న యచ్చరలతో వచ్చియున్నకాముపత్నితోఁ గమలక్రీడ నొనర్చు

చుండె నయ్యెడఁ గాలకేతుం డనునొక్క రక్కసుండు బహురక్షోగణపరి
వృతుండై యరుదెంచువాఁడు పంకజక్రీడ నొనర్చుమత్సఖి నేకావళిం
గాంచి తద్రూపమ్మున కచ్చెరువడి హరింప నెంచి డగ్గఱకు వచ్చునాలో
నాలోకించి యే నిట్లంటి. ౫౮౧

క. రక్కసుఁ డెవ్వాఁడొ యిచ్చటి, కుక్కుమెయిన్ వచ్చె ననిన యువ
తియుఁ దా నా, దిక్కు మొగంబై యెద భయ, మెక్క నుం గల
సి చొచ్చె భృత్యులనడుమన్. ౫౮౨

వ. పదంపడి కాలకేతుండు గదం గైకొని సత్వరగతి నేతెంచి
రక్షకులం దఱిమి జగన్మోహిని యగుమత్సఖిం గైకొని యరుగుచుండ వే
పమానయు భయత్రస్తయు నగునానెచ్చెలిరోదనంబు విని చేయున
ది లేక యేను వాని కిట్లంటి. ౫౮౩

క. అక్కట! మత్ప్రాణం బగు, నిక్కలికిం గొనఁగ నేల? యే వచ్చెద
నీ, విక్కమలాక్షిఁ ద్యజింపుము, చక్కఁగ నన్ గొనుము కరుణ స
ల్పుము పేర్మిన్. ౫౮౪

వ. అను నావచనమ్ములు గణింపక యరుగునారక్కసున కడ్డుపడి
రక్షకులు సంగరం బొనర్ప వానిపరిచారకు లగురాక్షసులు స్వామికా
ర్యతత్పరులై యెదిరి యోడించిరి. ౫౮౫

ఆ. వె. కాలకేతు విట్లు గండున రక్షకా, వళినిఁ దన్ని నాదుప్రాణస
ఖిని, గొని యు సేన దన్నుఁ గొలువఁగఁ దనపురి కరుగునంత నే
ను నతనివెంట. ౫౮౬

వ. తీవ్రగమనమ్మున రోదనం బొనర్చుచు నగుగునంత నన్నుం
గాంచి యేకావళి కొంత స్వస్థచిత్త యయ్యెఁ బదంపడి యెట్టకేలకు డ
గ్గఱ కరుగుడు నన్నుం గాఁగిలించికొని స్తంభస్వేదసమాకులయై కన్నీ
రు కాలువఁగా నేడ్చుచుండఁ గాలకేతువు ప్రీతిపూర్వకమ్ముగ నా కి
ట్లనియె. ౫౮౭

గీ॥ నాకలోకమ్మునకు సరి నాఁగ వచ్చు, మత్పురం బయ్యదియు కను
మా మృగాక్షి?, బెగడుమ్మై నగడుపడునీప్రియసఖియు, నికి వచింపు
ము ధైర్యమ్ము నెమ్మి గ్రమ్మ. ౫౮౭

క॥ ప్రీతిమెయి మీకుదాసుఁడఁ, గాతరతం గుందనేల? కడు మోద
మునన్, జేతము స్వస్థము గాఁగ ని, రాతంకత నుండుఁ డని సహా
దర మెసఁగన్. ౫౮౮

వ॥ నన్ను నమ్మృగాక్షికెలన రథమ్మునఁ గూర్చుండఁ బెట్టికొని
శీఘ్రగమనమ్మునఁ దనపురి కరిగి సంతసం బెసఁగ నొకధవళగృహమ్మున
మ మ్మిరువుర నుంచి చుట్టును ననేకుల రక్కసులఁ గావ నియమించి మ
ఱునాఁడట కనుదెంచి మంతనమ్మున నన్నుం గాంచి యిట్లనియె.

క॥ శోకముఁ ద్యజించి నీచెలి, నాకుం బత్ని యగునట్లొనర్పుము రా
జ్య, శ్రీ కథకారిణి తా నను, మేకోరికమైనఁ దీర్తు నే సేవకుఁడన్.

వ॥ నావుడు వాని కే నిట్లంటి నీకుం బ్రియం బొనర్పనంతసమ
ర్థత లేనిన న్నను గ్రహించి నీవై యిక్కన్నె బోధిం మనుడుఁ గా
మాతురుండు కాలకేతుండు మత్సఖి కిట్లనియె. ౫౯౧

ఉ॥ మానిని? నన్ గలంచుటకు మంత్రము నొక్కఁడు పంచి దాన మ
న్మానసమున్ గ్రహించి నిను నమ్మినదాసుని వీనిఁ బ్రోవఁగాఁ
బూనక యుంట పాడియె? సముజ్జ్వల మీనవయౌవనంబు ని
త్యానుగతంబు గామి వినవా? సఫలం బొనరింపఁ జెల్లదే. ౫౯౨

వ॥ నావుడు మజ్జనకుండు నన్ను రాజపుత్రునకీ నెంచె మ న్మ
నంబున హైహయుం డనురాగమ్మున వరించి యున్నదాన సనాతన మ
గుధర్మమ్ము వమ్ముఁ జేసి తక్కొరుల నెట్లుకైకొందుఁ దలిదండ్రులయిచ్చ క
నుగుణుం డగువరు వరింపఁ దగు వారలు గాని కన్యకలు స్వతంత్రలే?
యనునక్కలికియందుఁ గరుణింపక పాపాత్ముం డగునద్దానవుం డయ్యుద్య
మంబు విరమింపఁడ, అవ్వాని పురంబు పాతాళవివరమ్మున ననేకరక్షో
గణరక్షితంబై యేరికిఁ జొర రాకుండు ననుడు నేకవీరుండు యశోవతి
కిట్లనియె. ౫౯౩

క॥ నినునీనెచ్చెలితోడం, దనపురమున నుంచె నంటి దానవుఁడు మనం,
బున సంశయంబుదోఁచెడిఁ,జను దెంచితివెట్టు లిటకుఁ జంచలనయనా.

గీ॥ హైహయుం డనురాజన్యు నాత్మఁ గోరి, యున్నదాన నటంచు మీ
వన్నెలాఁడి, పలికె నంటివి ననుఁ దక్కఁ బార్థివుండు, హైహయుఁడు
లేఁడు ననుఁ గోరెనా? లతాంగి. ౫౯౭

క॥ మీనెచ్చెలిజనకుం డగు, మానవనాథుండు నన్ను మన్నించి యిడం
గా నీకన్నియఁ గనియెనె? మానక నాతోడఁ జెప్పుమా వెఱపేలా.

వ॥ అట్లని యారక్కసు నడంచి యిప్పుడ యప్పడఁతిఁ దోడ్తె
చ్చి నీవంతం బాపఁ గలవాఁడ నప్పట్టణంబునకు మార్గమ్ము నాకెఱిం
గింపు మని వెండియు. ౫౯౮

ఉ॥ దానవుఁ డాత్మజాతి నిటు దారుణరీతిని గొన్న సంగతి
న్మానవనాయకుండు వినెనా? యటులేనిఁ బ్రియత్న మేమియుం
జా నొనరింప కుండునె? సుతాహరణమ్మునకన్న దైన్య మెం
దేనియుఁ గల్గునేఁ యతఁడు హీనబలుండె మృగాక్షి తెల్పుమా.

వ॥ నీ పక్కన్నియగుణమ్ములు చెప్పినదిగోలె మన్మనంబు తదధీ
నంబై యెప్పు డయ్యతివ విడిపింతు నని సంరంభమ్ముఁ బొదలుచున్న
యది నాకుం గమనోపాయమ్ము నొడివి నీ వెట్లు వానిఁ గికురించి వచ్చి
తో తెలుపు మనునయ్యేకవీరునకు యశోవతి యిట్లనియె. ౫౯౯

గీ॥ చిన్నతనమ్మున నొకమంత్రిసిద్ధుఁ డిచ్చె, నాకు మంత్రింబు నరనాథ
వ్యాకులత్వ, మడర నారక్కసునిపురమందు నుండు, నెడలఁ దన్మం
త్రిరాజంబు స్మృతికి వచ్చె. ౬౦౦

క॥ ఆమంత్రిమ్మున దేవిఁ, గామపదఁ గొలుతునేనిఁ గలుగును మో
క్షం,బీమెయి నని యోజించి స, దా మనమున నంబ నిలిపి తత్పర
నగుచుం. ౬౦౧

వ॥ రక్తాంబరయు రక్తనయనయు సృష్టిస్థిత్యంతకారిణియు సౌ
మ్యయు విశ్వేశ్వరియు నగునప్పరశక్తి గుఱించి మంత్రంబు జపియించి

న నాపె యనుగ్రహించి నాకు స్వప్నమ్మునఁ బొడకట్టి యిట్లనియె.

ఉ॥ వైళము లెమ్ము పొమ్ము సురవైరిభయమ్మును వీడి గంగ కో
బాలరో! యేగుదెంచెడి నృపాలుఁడు హైహయుఁ డేకవీరుఁ డెం
తే లలితుండు మచ్చరణ నీరజబంభరితాంతరంగుఁ డీ
లో లలి నన్నదీతటికి లుంఠితశాత్రవుఁ డతండు పేర్మిమై. ౬౦౩

క॥ దత్తాత్రేయమహాముని, దత్తంబై యెంతకేనిఁ దగియెడిదానిం
జిత్తమున మహావిద్యన, మత్తుండై పఠన చేయు మత్ప్రీతికినై.

వ॥ లక్ష్మీపుత్రుండగు నన్నరవరుండు విహారం బొనరించుచు ని
న్నుం గాంచి శరణంబై రాక్షసుం జంపి యేకావళి విడిపించుఁ బిమ్మట
నీనెచ్చెలి కారాజసుతుం బతిగా నీ వొనరించునది యని చెప్పి యా
పె యంతర్ధానం బగుడు మేల్కాంచి స్వప్నవృత్తాంతంబు వచించిన
నేకావళి ప్రసన్నవదనయై నా కిట్లనియె. ౬౦౫

గీ॥ అప్పరాంబికవచనంబు తప్పదిష్ట, యేగు మతిరయమున గంగకీ
వు నాకుఁ,బ్రీతియొనరింపు మనిన నాపెవచనమున, నిటకు వచ్చితిఁ
బరశక్తికృప నృపాల. ౬౦౬

వ॥ జగజ్జననియు నాకు శీఘ్రగమనంబును మార్గజ్ఞానంబును నొ
సంగె నియ్యది యస్మదీయోదంతం బింక నీవృత్తాంతమ్ము నుడువు మను
నయ్యాళో వతి కేకవీరుం డిట్లనియె. ౬౦౭

గీ॥ సంపదల నిచ్చుచెలి నాకు జనని హైహా, యుండ నన్నేకవీరుఁ డ
టంద్రు మన్మ,నంబు పరతంత్ర మయ్యె ననంగజనక,మైనమీచెలివృ
త్తాంత మానుకతన. ౬౦౮

చ॥ మొదల సమస్తలోకముల మోహము గొల్పెడిదానియంద మిం
పొదవ వచించి తంత మదనోదయ మయ్యె గుణమ్ములన్ వచిం
ప దొరఁకొనన్, మనంబు వశవైఖరి నొప్పె "నినున్ వరించె నా
సుదతి" యటంచుఁ జెప్పి నను సుందరి! దాసునిఁ జేసి తింతికిన్.

ఉ॥ ఏమి యొనర్చువాఁడఁ గమలేక్షణ? మీ కుపకార; మెట్లు నా
కామహిళాజనాభరణ, మాయనవద్యవిలాస, యాకన
త్కోమలగాత్రి యున్న యెడకుం జన నా నెటు వానిఁ జంపి యా
సామజయానఁ దేర నగు జన్మము సార్థకమై చెలంగఁగన్. ౬౧౦

క॥ ఆపురిమార్గము సెప్పుడ, యాపరు లెవ్వారు? నీవయనుకంపన్ సం
తాపపరీతుని నను సౌ, ఖ్యోపేతు నొనర్పు మింతయొప్పదె నీకున్.

చ॥ నుడివితివేని వైళము మనోగమనమ్మున నేగి రక్కసుం
బొడిచి నృపాలపుత్రిక సముజ్జ్వలతేజ మెసంగఁ దెచ్చి పెం
పడరఁగ నిన్నుఁ గూర్చి రయ మారఁగఁ దత్పురిఁ జేర్చి పేర్మి మీ
యొడయనికిం బ్రమోద మిడ నోపుదు నుక్కుత్రుటిన్ దలోదరీ.

వ॥ ఇట్లు సల్పుట నీకును నాకును మనఃప్రియం బగుఁ బిమ్మటఁ దజ్జనకుండు వివాహం బొనర్చి న న్నాదరించుఁ బరదారాపహర్త యగు నవ్వాని వధించునుపాయంబు నీయధీనంబై యున్నయది తత్పురంబు చూపి మత్పరాక్రమంబు గనుఁగొందుగాక నావుడు యశోవతి ప్రియకారి యగు నన్నరేంద్రువచనంబులకు సంతసించి గమనోపాయం బిట్లు వచించె. ౬౧౩

క॥ జననాథ? మంత్ర మిచ్చెదఁ. గొను మాపై సేసతో నకుంఠితవృత్తిన్
జనియారక్కసునని లోఁ, దునిమెదు తేనేర్తువా విధువదన నెలమిన్.

వ॥ అని యత్తలోదరి దత్తాత్రేయునికతనఁ దనకు లభించినత్రిలోకీతిలకం బనుమంత్రం బుపదేశించినఁ దత్ప్రభావమ్మున సర్వజ్ఞతయు సర్వాంతశ్చారితయుఁ గలిగిన నన్నరవరుండు సైన్యసమేతుండై య య్యంగనతోఁ బన్నగావిష్టం బగు పాతాళంబుపగిది రక్షోగణరక్షితం బగుతత్పురమ్మున కరుగుటయు. ౬౧౫

గీ॥ వచ్చుసైన్యమ్ము నీక్షించి పెచ్చుపెరుఁగు, దుడుకుమైఁ గాలకేతుని
దూత లెల్ల, నరిగి యేకావళీకన్యకాంతికమున, వినయము లొనర్చు
తమపతిఁ గని భయమున. ౬౧౬

వ॥ ఇట్లనిరి.

ఉ॥ సైన్యము చుట్టురా నెగడుచక్కనిరాచకొమారుతోడ ని
క్కన్యకుఁ దోడునీడ యగుకామిని వచ్చుచునున్న దన్యరా
జన్యభయంకరుం డతఁడు శక్రితనూజుఁడొ? కార్తికేయుఁడో?
యన్యుఁడొ? చెప్పఁ జొప్పడ దహంకృతి కాకృతి నాఁగఁదోఁచెడిన్

వ॥ యోజనత్రియమ్ములోఁ దత్సైన్యం బున్నయది యిటకు వ
చ్చునంతలో సన్నద్ధుండ వగుము కాదేని యియ్యబ్జాక్షి విడిచి శరణ
మ్మనిఁ గొనుము నావుడుఁ గాలకేతుండు క్రోధమూర్ఛితుండై సబలం
బుగా రక్షోవీరులం బనిచి మరల నేకావళీనికటమ్మునకు వచ్చి ప్రణయ
మ్మున నమ్ముదిత కిట్లను. ౬౧౮

ఉ॥ వచ్చెడివానిఁ దెల్పు మనవద్యచరిత్రుఁడు నీదుతండ్రి దాఁ
బొచ్చెములేనికూర్మిఁ గనుపొంచెె వెసన్ జనుదెంచెనేని నే
హెచ్చుగుపేర్మి నిష్ఠ యెదు రేగి రణం బొనరింప కింటికిం
దెచ్చి బహూకరించెద ననిం దెగటార్చెద నన్యుఁడైనచోన్.

వ॥ నావుడు నేకావళి యిట్లను నీబంధనమ్మున నున్న నా కతం
డెవ్వఁడో యెఱుంగ రాదు మజ్జనకుండోండె మత్సహోదరుండోండెఁ
గామి నిక్కంబు మఱియెవ్వఁడో మహాబలశాలియై యుండ నోపు నిం
దుల కతం డేమిటికతమ్మున వచ్చెనో యని శంకింతు ; వుడు దైత్యుం
డిట్లను. ౬౨౦

క॥ దూతలు యశోవతియయిట, కేతెంచెన్ సేనగొలువ నెవ్వఁడొ తన
తోఁ, బ్రీతిమెయి రాఁగ ననిరి య, ర్హాతులు నాకితరు లెవరు?
రాకేందుముఖీ. ౬౨౧

వ॥ ఆతండు నీజనకుండ కా యని తోఁచెడి యశోవతి యిటనుం
డి యెట్లరిగె? నీ వెఱుంగుదే! యని పలుకునాలో మరల దూత లేతెం
చి యిట్లనిరి. ౬౨౨

క॥ డగ్గఱకు వచ్చె సైన్యము, నుగ్గగు నీకఁబురము వే గనుంగొని చ
నుమీ, ప్రెగ్గడలతో రణమ్మున, కెగ్గగుఁ దడ వాచరించితే నీక
మనకున్. ౬౨౩

వ॥ నాపుడుఁ గాలకేతుండు తూర్ణంబుగ రథ మెక్కి సేనాయుతుండై చనునంత నేకవీరుండును హయారూఢుండై కామినీవిరహసంజనితక్రోధుండై తలపడియె నిట్లిరువురును దలపడి వృత్రవాసవుల విధమ్మున ఘోరంబగుసంగ్రామం బొనర్చునెడ. ౬౨౪

గీ॥ అస్త్రశస్త్రములెల్ల దిగంతరముల, నాక్రమించెఁ దమంబు భూచ
క్రమెల్లఁ, బొదివెఁ గాతరులకు భయం బొదవె నంత, నేకవీరుండు
గదఁ గొని యేసె నతని. ౬౨౫

క॥ వ్రేటువడి రక్కసుఁడు శత, కోటి హతిం దెగినమేటికుధరం బన ను
త్పాటితజీవనుఁడై పడె, నాటోపతఁ దక్కి సైన్య మటునిటు చెదరెన్.

వ॥ పదంపడి యశోవతి సత్వరమ్ము నరిగి యేకావళి కిట్లను.

చ॥ పనిగొని యేకవీరనరపాలకుఁ డుక్కడఁగించి రక్కసుం
దునిమె లతాంగి! నెవ్వగలఁ దొల్గుము చే చను దెమ్ము నిన్నుఁ దా
వినినకతమ్మునన్ గనఁగ వేడుక చెందునృపాలునిం గృపా
ళుని సదయాంతరంగమున లోఁ గొని యాతనియుప్పు దీర్పుమా.

క॥ మున్ను నిను విన్నదాదిగఁ, దన్నెఱుఁగక విరహవార్ధిఁ దవిలిన
నృపునిన్, మన్ననఁ జేయుటకన్నను, బున్నెముఁ బురుషార్థ మొ
కఁడు పుడమిం గలదే. ౬౨౭

వ॥ నాపుడు లజ్జితమై యే నస్వతంత్రనై యాతని నెట్లు వీక్షింతుఁ గామార్తుం డగుకతన నన్నతం డెట్లు గ్రహింపకుండు నని చింతించుచు యశోవతీసహితమ్ముగ నరయానమ్మున నేకవీరునికటమ్మున కరుగుటయు. ౬౨౮

క॥ మలినాంబరధారిణి న, న్నళినాక్షిం గాంచి పలుకు నరపతి "నేత్రం
బులతృష్ణదీర నొకపరి, తలిరుంబోఁడిరో! యొసంగుదర్శన" మనుడున్.

వ॥ సిగ్గునఁ గ్రమ్మఱ గ్గజగమనయై ఖరియుఁ గామార్తుం డగు వ న్నరనాథుతత్త్రమ్మును గాంచి నీతికోవిద యగుయశోవతి యిట్లనియె.

ఉ॥ ఈనళినాక్షిఁ దండ్రి తగ నీఁదలఁచెఁ మది నీకుఁ; ద్వాదశాం బై నెగడుఁ లతాంగిహృదయం; బొకయుంచుక సైఁచితేని శా స్త్రోక్తనుగతిఁ వివాహ మగు నందఱకుఁ హృదయుంగమంబుగా నా, నతఁ డిరువ్వరం గొని ఘనమ్ముగఁ దత్పుర మేగ నేగినన్. ౬౩౨

వ॥ నృపాలుం డెదురేతెంచి కుమారిక నాఁ కించి సంతసించి యశోవతీనివేదితవృత్తాంతుండై యేకవీరుం గలసికొని గారవించి గృహ మ్మున కరిగి విధివిధానమ్ముగ దైవజ్ఞనిర్ణీతం బగు నొక్కసుముహూర్త మ్మున నతనికిఁ గన్యాదానమ్ము చేసి వివాహం బొనర్చి పారిబర్హం బొ సంగి యశోవతీసమన్వితమ్ముగ నతింటికనిచె. ౬౩౩

గీ॥ అట్లు భార్యాసమేతుఁడై యరిగి పురికి, నేకవీరుండు భోగమ్ము లెన యుచుండె, నతనితనుజుండు కృతవీర్యుఁ డతనికొడుకు, కార్తవీ ర్యుండు వంశ మిక్కరణి నెగడె. ౬౩౪

వ॥ నావుడు జనమేజయుం డిట్లనియె.

చ॥ అనఘ! భవన్ముఖాంబుజమునం దుదయించెడి సత్కథామృతం బును దగఁ గ్రోలునాకుఁ దుద మట్టదు తృష్ణ; విచిత్రమై వా చెనసెను హైహయాద్యధిపులయెల్ల చరిత్రము, దేవదేవు జననయునుఁ డన్నియుఁ సలుపువాఁడు స్వతంత్ర

వ॥ కొమరుం గన్ననా స్త యతాఁ

నుం డిట్లనియె.



సీ॥ విను జనమేజయ!

మిఁ జూచు, వ

మ్ము మోదాను

శ్రమంబును ము

మ్యాపాశ్రమునకు నేతెంచిన మొనసి యేను॥ గీ॥ నర్ఘ్యపాద్యాది
సత్కృతు లాచరించి,యాసనస్థితుఁ డై నయయ్యనఘునొద్ద। భక్తి
మై నుండి యిట్లంటి "భవ్యతేజ!, కలదె! సంసారమున నించుక
యు సుఖంబు. ౬౩౭

ఉ॥ ద్వీపమునన్ జనించితిని దెంపరినై యట వీడెఁ దల్లి య
య్యాపద గోర్చి కర్మమున నయ్యటవిన్ బెనుపొంది యాత్మజా
శాపరిపూర్తికిన్ దపము సల్పితి నెక్కుడుకాల మంత న
త్తాపసగమ్యుఁ డిచ్చె సుతుఁ దత్త్వవిదున్ గిరిశుండు నా కొగిన్.

గీ॥ వాఁడు వేదంబు పఠియించి పండితప్రవరుఁడయి యశంబు గొని
నీదువచనము విని, సంసృతిఁ ద్యజించి నాదువిచారమొన్న, కరిగె
లోకాంతరంబు నేమనఁగ వచ్చు. ౬౩౯

చ॥ పదపడి హా! శుకా! యనుచుఁ బావనుఁ డౌతనయుంగుఱించి దుః
ఖదశ నడంగి మేరుగిరిఁ గాతరతన్ ద్యజియించి మాత నె
మ్మదిఁ దం పోసి యేగి యట మంజనన్ దగ శంతనుండు మే
లొదవ గ్రహించె నంచు విని యుంటి నిటం దప మాచరించుచున్.

వ॥ అంతఁ గొండొకకాలమ్మునకు శంతనుండు దివం బరుగుట
త్రిద్వితయసంయుత యగుమజ్జనని విదురయై భీష్మునిచే రక్షిం
ఁ జిత్రాంగదుండు రా జగుటయుఁ బదంపడి యతండు
పుత్రదుఃఖమ్మునఁ గుందుతల్లి నూఱార్చ నేగి భీ
మీఁద భీష్ముండు విచిత్రవీర్యునకు రా
గరం దెచ్చి సత్యవతికి సమర్పించి
కుమారునకుఁ బెండ్లి చేసె
ట నతండును మత్కృ
తుం డయ్యె దాన
నయుం బాం బాలిక
ంచిన నాపె యొ
ర్తెఱింగి యే నట

కరిగి యూపిన్న తమ్ముని కౌర్ధ్వదైహికమ్ము లొనర్చి తల్లి నోదార్చి హస్తి నగరమ్మునన యుండి యొక్కనాఁడు కృతాంజలినై తల్లీ! న న్నేల రప్పించితి వచింపు నావుడు సత్యవతి పుత్రా! నీసహోదరు లిర్వురును ననపత్యులై పరలోకమ్మున కరిగిరి వంశచ్ఛేదమ్మునకుఁ గొంకి నిన్నుఁ దలంచితి మదాజ్ఞం జేసి గాంగేయుననుమతిమ్మునఁ గురుకులాభివృద్ధికై కడంగి కాశిరాజసుతలయందు సంతతిం బడయు మిద్దాన దోషం వాటిల్ల దన నేను జింతాలజ్జామగ్నుండనై యమ్మహాభాగ కతివి మ్మున నిట్లంటి.

ఉ॥ ధర్మ మెటింగి యేను బరదారసమాగమ మెట్లొనర్తు? ర
క్మర్మ మొనర్చి వంశమును గాచిన దానఁ దరించి యెఁ
శర్మగతిం బిత్రుపిత్రితతి సంతస మందునె? న్యాయశా
స్త్రర్మములుఁ బురాణములు మత్కృతముల్

ఉ॥ నావుడు నన్నుఁ జూచి వదనమ్మున విన్నఁద
తా? విను పుత్రశోకముకతమ్మున దై
భావ మెటింగి యిట్లొనరుపంగదవయ
యేవిధులాచరింతు రవియే మన కు

క॥ ఈవిధిదోషం బయ్యును,నావచనం
పావహ మయ్యును బెద్దల,చేవిహిత

క॥ అని పలుకునంత గంగా,తనయుఁడను
యనఘా!జననీవాక్యము,గొ విహ

క॥ అని యాతండును జనని యు,నన్నుం
జ్జనసింద్య మైనయాఁకృతి,కను

వ॥ అంత నయ్యంబి

మూయుటకుఁ
నాఁడు రవ
నన్ను శి

న్నారెఁ దదీయసంగతు లసంగకలానుమతమ్ము లయ్యె సా
ధారణరీతి నిస్స్వరకుఁ దారసమై తగెఁ గూర్మి యొప్పఁగన్. ౬౫౮

వ॥ దానికిఁ బ్రీతిం జెంది పరవశం బైనచిత్తమ్మున.

గీ॥ సత్యవాది కళాశాలి సర్వలక్షణములఁ బొల్పెడివాఁడు విన్నాణ
మైన, రూపసఁగువాఁడు నీ కొక్కరుఁడు సుతుండు, కలుగు నని
వర మిచ్చితిఁ గాంత కంత. ౬౫౯

వ॥ విదురుం డుద్భవించె నిట్లు మాయావశమ్మునఁ బరక్షేత్రమ్మున మూఁగురఁ గొమరులం గని శుకవిరహజనిత మ్మగుశోకమ్ము వాసి సంతుష్టాంతరంగుండ నైతి నరూపయు నిరాలంబయు జ్ఞానులకు సయితము మోహకారిణియు నగుమాయ యకృతాత్ముల కెఱకిం ద్యజింప రాదు.

గీ॥ తల్లి యెడఁ గల్గుబంధంబు దవులఁ జేసె, నాఁ
ది నాకు, మనము డోలాయమానమై '
యొక్కెడ నిశ్చయం బంద కుండు.

చ॥ కరినగరాధవాస నొకకాలము ం
స్థిరత యొకప్డు; వేఱొకగతి
ని రహిం నొకప్డు నిశ్చలత
నరతి నొకప్డు డెప్పుడ్

చ॥ కొమరులఁ గంటి
ధము నొవరి
గమమున
క్రిను

వ॥

పడి మాతృ
రాష్ట

గీ॥ శూరసేనునియాత్మజ సుగుణ కుంతి, మద్రరాజకుమారిక మాద్రి
వీర, లిరువురును నాత్మపత్నులై యెసక మెసఁగఁ, బాండు భూపా
లకుఁడు రాజ్యభార మూని. ౬౬౧

వ॥ ఒక్కెడ ద్విజశాపమ్ము నంది నిర్విణ్ణుండై రాజ్యమ్ము విడిచి యరణ్యమ్మున కరిగె నవ్వార్త వినుకతన నాకు మరల దుఃఖం బను సరించె. ౬౬౨

క॥ సతు లిరువురు గొలువఁగ నా,సుతుఁడున్నెడ కరిగి కొన్ని నూక్తుల
మోదా, న్వితుఁ జేసి కరినగరసం, స్థితు ధృతరాష్ట్రుఁ గని యరుగు
దెంచితి నిటకున్. ౬౬౩

... సతియుగమ్మునందు ధర్మానిలేంద్రాశ్వినుల
... జులఁ బంచపాండవుల యుధిష్ఠిరభీమసేనా
... రిం గనియెఁ బరంపడి యాతం డొక్కనాఁడు
... లించినకతన శాపదగ్ధుండై మృతుండై ప
... మాద్రియుఁ బతిపరాయణయై యగ్ని
... యగుకుంతి సూతా
... నకుఁ దోడ్కొని వచ్చి
... త్తాంతమ్ము విని యేను
... వులు భీష్మ విదురధృ
... కుండఁ గూర్మిరమా
... తోఁ బరస్ప
... దెంచి భీష్మ
... ౬౬

వ॥ భీష్మాదులయెడ నధికవైరమ్ము గనుటకుఁ జింతించి ధృతరాష్ట్రుండు విరోధశమనమ్మునకై పాండవులకు వారణావతమ్మున నివాసం బేర్పఱిచె నంత నప్పట్టణమ్మున. ౬౬౬

గీ॥ కుటిలుఁడు సుయోధనునియాజ్ఞఁ గొని పురోచ, నుండు నిర్మించె జతుగృహమండలంబు, నచటఁ జిచ్చునఁ బాండవు లడఁగి రనుచు, విని మనుమలైనకతన దుఃఖనిధి నైతి. ౬౬౭

వ॥ అట్లు దుఃఖించుచును వనమ్మునఁ గుంతీసహితమ్ముగఁ బాండుపుత్రులు గన్పట్టిన నఖండానందభరితుండ నైతి. ౬౬౮

క॥ పిమ్మట మత్పౌత్రులై, సమ్మతి ద్రుపదునిపురంబు చని రేఖ[illegible] పొం కమ్మగుభూదైవతవే, షమ్ముల నప్పార్థు లతికృశత్వము [illegible]దరన్.

చ॥ నరుఁడు పరాక్రమక్రమమునన్ ద్రుపదాత్మజ [illegible] తెచ్చె నే వురకును సాధ్వి యయ్యె నలపుష్పసుగంధి[illegible] [illegible]ంతియాజ్ఞఁ ద త్పరిణయము గనుంగొని ముదంబు నెదన్[illegible] [illegible]ఁడ మీఁద న త్తరుణియుఁ బార్థులుం గలసి దంతిపుర[illegible] [illegible]గరిమ్ముగన్. ౬౭౦

వ॥ ధృతరాష్ట్రుండును [illegible]గలకు [illegible]ప్రస్థమ్ము నివాసమ్ముగాఁ గల్పించె నటఁ గృష్ణసహాయుఁ [illegible]వకు సంతృప్తుఁ జేసె.

క॥ వారలు లోకోన్నతు[illegible], శూ[illegible] [illegible]లు రాజసూయ మొ నర్పం[illegible] [illegible] త్రై[illegible]భవమును, [illegible]మెంతేని మోద మంది తి నా[illegible]న్. ౬౭౧

[illegible]॥ మయనిర్మితం బగుతత్సభావిశేషంబు వర్ణింప నలవి గాదు తద్వైభవమ్మునకు [illegible] దుర్యోధనుం డసూయాగ్రస్తుండై [illegible] దురోదరం బొనర్చి దుర్ద్యూతకుశలుం డగుశకునికతన ధ[illegible] [illegible]డించి రాజ్యమ్ము గైకొని యంతఁ [illegible] వ్రేదనవమానించె.

[illegible]నముసఁ బండ్రెండేడులు, మనుమలు పాండవులు ద్రుపదమహీపా [illegible]జతో, నెనసిరి కష్టముల నా, [illegible] మది హేతువుగ దుఃఖమగ్న [illegible] గాంచెన్. ౬౭౪

క॥ ఈక్రియ సుఖదుఃఖమ్ముల, కాకర మగుభవమునందు నడుగంటితి ధ
ర్మాకలన మెఱిఁగి భ్రాంతిం, జేకొనునా కొక్క తెఱువు సెప్పు
మహాత్మా. ౬౨౫

## నారద వివాహము.

క॥ ఎక్కడిసతు లెక్కడిసుతు, లెక్కడితలిదండ్రు లకట! యే నిక్క
రణిం, జిక్కితి సంసారమ్మున, ముక్కవమెయి భ్రాంతి మిగుల మఱ
పించుటచేన్. ౬౨౬

క॥ శ్రీలారూఢంబై మది, వాలాయము మదము దక్కి నంతం బడు
నా, కేళిల సౌఖ్యమ్ము బ్బ జ, టాలాగ్రణి? దెల్పవే? కటాక్షము
పేర్మిన్. ౬౨౭

వ॥ ఇట్లు [illegible]క్కిం బ్రార్థించునాకు నారదుం డిట్లనియె.

క॥ పారాశర్య? పురాణాధార? యిటుల్ సారెసారె దర్శింపకు సం,సా
రమున మోహార[illegible] [illegible]ధారయ లేఁడొక్కరుండు నని యెఱుఁ
గ్గవాకో. ౬౨౮

గీ॥ హరిహరవిరించులు[illegible] [illegible]నులు, మాయలోఁ బడి సంసార
మార్గమందుఁ, బొరఁ [illegible] [illegible]యల్ పొగడుచుండ్రు,
జ్ఞాని యని; నేను నట్టిఁ[illegible] [illegible] ౬౨౯

గీ॥ మోహసంగతిఁజేసి యో[illegible] వరేణ్య, [illegible]కై మును నాపడ్డపా
టులెల్ల, విస్తరించి వచింతు వినుము దాన, నడఁగు నీసంశయము
లెల్ల ననఘచరిత. ౬౩౦

వ॥ ఒక్కనాఁడు నేనును బర్వతుండును గలసి భరతఖండంబు
చూడం జని యందంద తిరుగుచుఁ బుణ్యక్షేత్రమ్ము లాలోకించుచు
మున్యాశ్రమమ్ములు దిలకించుచు నొక్కసమయమ్మున నొకసమయం
బొనర్చికొంటిమి. ౬౩౧

క॥ మంచియుఁ జెడ్డ యనుచు లో, నెంచక మనయాత్మఁ బొడముని[illegible]
ల మనలో, నించుకయు డాఁపఁగాఁ జన, దంచితగతి నొక్క రొకరి
కది చెప్పఁ దగున్. ౬౩౨

వ॥ ఇట్లు పరస్పరమును సమయం బొనర్చికొని మైత్రి యొసంగ స్వర్గలోకమ్ము విడిచి భూలోకమ్మునఁ బ్రగుమ్మరునంత గ్రీష్మాంతం బరుగుదెంచె. ౬౮౩

క॥ చాతుర్మాస్యవ్రతమును, బ్రీతిఁ సంజయుఁ డనునొకపృథివీశుపురం
బేతెంచి సలుపుకొంటిమి, యాతనిసదనమ్మునన్ గృతావాసులమై.

ఉ॥ నాలుగుమాసముల్ దగు ఘనం బగువర్షము లానెలల్ సుఖ
శ్రీ లలిఁ గోరుమానవులు సేయఁగ రాదు ప్రవాస ; మాపయిన్
బోలు నొనర్ప నంచుఁ దలపోసి సుఖమ్ముగ సంజయుండు స
చ్ఛీలుఁడు గొల్వఁ దత్పురి వసించితి మెంతయు సంతసమ్మునన్.

వ॥ అన్నరనాయకుండు మాకుఁ బరిచర్య యొనర్పఁ దనకూఁతు దమయంతి యనుదాని నియోగించె. ౬౮౬

గీ॥ స్నాన మొనరింప జలము భోజన మొనర్ప, నిష్ట మగువస్తువులు
శయ్య యెద్దియేని, [illegible] కొరనన్ మా కిడుఁ గొసరి కొసరి, హెచ్చు
తగ్గులు లేకుండ [illegible] ౬౮౭

వ॥ ఇట్లక్కన్నియ మమ్ము[illegible]వుర సేవింపవేదాధ్యయనమ్ములను గానవినోదమ్ములను గాలమ్ము పుచ్చుచుంటిమి. ౬౮౮

మ॥ అనుకూలమ్ముగ వీణ సుస్వరయుతం బౌనట్లు సారించి నె
మ్మన మానందరసాప్లుతార్ద్రమునునన్ మగ్నమ్ముగా సామవే
దనినాదం బొనరింప దాని విని యత్తన్వీశిరోరత్న మె
క్కినమోహంబునఁ జేరి నాయెడలఁ దాఁ గీలించెఁ గామార్తయై.

క॥ ఆతరుణీరత్నం బిటు, చేతోభవుబారిఁ దవిలి చేసెడిచెయ్వుల్,
ప్రీతి గలిగించె నాకుఁ బురాతనకర్మములు దాఁట రా దెవ్వరికిన్.

వ॥ ఇట్లు నాయందు లబ్ధానురాగ యగుకతన నక్కలికిమిన్న స్నానపానాద్యుపచారములయందు మాయిరువుర కొక్కింత భేదంబు సల్పుచుండు. ౬౯౧

సీ॥ స్నాన మొనర్పనుష్ణజలంబునాకిచ్చు శీతలోదకమిడుఁ జెలియయతని
కింపైనపెరుఁగు నా కింతి వడ్డనసేయుఁ దక్రంబువోయు నత్తపసికతివ
శయ్య గల్పించుఁ బ్రశస్తముగానాకు నాతసు కొకభంగి నలవరించు
సొగసుమేల్ చూపులఁజూచునన్ బేర్మిమెఁజూడదారీతిగానుదతియతని

గీ॥ నెల్ల యుపచారముల నిట్టు లేకరీతి, మాని తనుఁ గొంచెపఱుచుట
మౌనిగాంచి, సందియము నెమ్మనమ్మునఁ బొందుపడఁగ, నన్నుఁ గ
ని యిట్లు లను మంతనమ్మునందు. ౬౯౨

ఉ॥ భోజనమజ్జనాదుల నపూర్వవుఁగృత్యములన్ మనోభవ
శ్రీ జనియింపఁ జేసెడివిశిష్టవిలాసముల న్నినుం గనున్
రాజతనూజ యక్కరణి నన్ గనకుండెడి నిన్ వరింపఁగా
నాజలజేక్షణామణికి నాస్థ గింపఁగఁ బోలు నద్ది రే. ౬౯౩

వ॥ నీమనమ్మును నత్తలోదరియందు లగ్నంబకాఁ గనుపట్టెడి.

క॥ మనమనములఁ గలసంగతు, లనఁ కొనవలయు నం చప్పా
డోన, ర్చినసమయము మఱువఁ, జనునే! సత్యము వచింపు
సందియమేలా? ౬౯౪

ఉ॥ నావుడు లజ్జ పెంపు వదనమ్మును వంపఁగ నెట్టకేలకున్
భావము డాఁపరామి నిటు పర్వతుతో వచియించితిన్ మునీం
ద్రా! విను మాలతాంగి నను నాథునిఁగా మదిఁ గోరె నట్ల నా
కీనళినాక్షియందు రమియించె మనం బిఁక డాఁప నేటికిన్. ౬౯౫

వ॥ అనుమాటలకుఁ బర్వతుండు కోపాకులుండై నన్నుం గాంచి
సమయోల్లంఘనం బొనర్చి నన్ను వంచించితివి గాన వానరవక్త్రుం
డవు కమ్మని శపించె ననుపదంబ యేనును నోర్పులేమిఁ దాదృశుండనై
యిట్లు ప్రతిశాపం బిచ్చితి. ౬౯౬

గీ॥ స్వల్ప మగునపరాధంబు సైఁప కిట్లు, శాప మిచ్చిననీ కిఁక స్వర్గ
వాస, మెడలి మర్త్యమ్మునన వసియించుటబ్బు, ననుడు శాపోపహతి
నేగె నతఁడు దరలి. ౬౯౭

క॥ వానరవక్త్రుఁడనై వీ, ణానినదం బొప్పఁ జేయుచున్నంగని యా,
మీనేక్షణ గానాదర, మూనుటఁ దా వైమనస్య మూనదు వింటే.

గీ॥ అనిననిట్లంటి నేనునోమునివరేణ్య, సుందరాస్యుండ వెట్లైతిసుదతినిన్ను
నేగతివరించెఁ బర్వతుఁడేడకేగె, సంగమంబెట్లుచెల్లెఁ జెప్పంగఁ
దగదె. ౬౯౯

క॥ నావుడునారదుఁడనువ్యా, సా! విను గూఢయాచరిత్రి మతిగహనము
కా, దే వారింపఁ దరంబే, యేవారికిన్నైన నెందునేనియుఁ దలఁపఁ.

వ॥ అట్లుమద్భాగినేయుండగు పర్వతుండు కోపుండై యరిగిన నే
నత్యంతదుఃఖతుండనై యటనుంటి నక్కన్నెమిన్న యథాపూర్వమ్ముగ
మత్సేవాపరాయణయై యుండెఁ బిదప నత్తలోదరికి వివాహంబొ
నర్ప నెంచి సంజయుండు మంత్రి కిట్లనియె ౭౦౦

ఆ॥ వె॥ వరునిరూపవంతు వరగుణసంపన్ను, సుకులజాతు ననఘు శూరు
నొకనిఁ, జూడు మీలతాంగిసాగసునకనుగుణుఁ, డైనవానిఁ బెండ్లి
యాచరింతు. ౭౦౧

వ॥ నావుడుమంత్రిరాజా! తాదృశులగు రాకొమరుల నేకులు గల
రందు నీకెవ్వండు నచ్చు నక్కుమారుం దెచ్చి కన్యాదానంబు విధిచో
దితంబుగ నొనర్చి కృతార్థుండ వగు మనుడు సంజయుండు తదన్వేష
ణాయత్తచిత్తుండై యున్నంత దమయంతి యంతయు ధాత్రీముఖమ్ము
న విని తనమనోరథం బద్దానికిఁ దెలిపిన నయ్యది నృపాలుపాలికిం జని
తద్వచనమ్ములు గా నిట్లనియె. ౭౦౩

ఉ॥ జనకా! నారదునిన్ వరించి యితరేచ్ఛాశూన్యనై నన్ను న
న్యుని కీ నెంచకు నక్రియాశూన్యమయి సంతోషప్రదంబై రసం
బున నత్యారతి నొప్పి మీనముల కిమ్ముం గాక నిర్ధుష్టతం
దనరుణ్ దన్మహతీనినాద మనుసంధింబు నే మున్గితిన్. ౭౦౪

వ॥ అని దమయంతి విన్నవింపు మనియె ననుచు నృపాలుండు
సమీపమ్మున నున్నతనభార్య యగుకైకేయిం జూచి. ౭౦౫

గీ॥ ధాత్రిచెప్పినమాటలు తరుణి వింటె, వరునిఁగా నెట్లుగోరె నవ్వాన
రాస్యఁ, గోరెఁ గాకెట్టు లీఁ దగుఁ గుటిలరూపుఁ, డాతఁ డెటు ద
గు మనదమయంతి కకట. ౨౦౬

వ॥ బుద్ధిహీనతం జేసి కన్నియలకుఁ గార్యాకార్యమ్ములు తెలి
యకుండిన వారించుట మనకుఁ గర్జం బగుట నీవు భిక్షుకుం డతఁ డని
చెప్పి బోధింపు మనవుడుఁ గైకేయి మంతనమ్మునఁ బుత్రి కిట్లనియె ౨౦౭

చ॥ ఱత కెనవచ్చి యెక్కుడు తళత్తళఁబొల్చెడి నీదుమేను; రూ
క్షతనుఁ డతండు భస్మమును సారెకు మెత్తుటఁజేసి; సుందరం
బతివ? భవన్ముఖం; బకట? యాతఁడు గోఁతిమొగమ్మువాఁడు స
మ్మతుఁ డెటు లాయె నారదుఁడు? మాటలపొందిక గోఁతికొప్పునే

క॥ నరులకు వానరులకు, నెక్కరణిన్ మాటలు పొసంగుఁ గాకతఁడు
సదా, తిరుగున్ భిక్షుకుఁడై యాదర మెటు నీ కబ్బె నిట్టితాపసు
మీఁదన్. ౨౦౮

ఉ॥ అందముఁగోరుఁ గన్నె; నృపులం దది వోల్చు లతాంగి? యిట్టిసీ
మందత కేమి యుందు మతిమాలిననీ కయి కుందె రాజు, సొం
పుం దగుమాలతీలత బుబూలనగోపరి లగ్నమైన దా
నిం దిలకించి ఖేదమును నెక్కొనకుండెడివార లుందురే ౨౧౦

క॥ మృదుతాంబూలీదళముల, నెద నుష్ట్రిమ్మున కొసంగ నెవఁ డొప్పె
డి?నా, రదుచేతఁ ఒడ్డ నినుఁగని, ముదితలు నవ్వరె వివాహమున
నాతల్లీ. ౨౧౧

వ॥ అని పలుతెఱఁగులఁబోధించుతల్లికి గానరసకోవిద యగుసద్ద
మయంతి నాయెడఁ గృతనిశ్చయయై యిట్లనియె ౨౧౨

క॥ మొగమును సామ్రాజ్యమ్మును, సొగసును ధనమేల శుద్ధశుంఠకుఁ;
దల్లీ?, మొగమును సామ్రాజ్యమ్మును సొగసును ధనమేల రసవశుం
డీతనికిన్, ౨౧౩

క॥ గానరసమ్మున హరిణులు, మే నెఱుఁగక ప్రాణ మిచ్చి మేల్ వడయ
నిసీ! మానవులు గొండతీరస, మానంగాలేరుజన్మమది యెందులకో
గీ॥ అరయ సప్తస్వరాత్మిక మైనవిద్య, నెఱుఁగు నారదమునిచంద్రుఁ
డెఱుఁగు హరుఁడు, వ్రేలు మడిచి వచింపఁగ వేఱొకండు, గానఁ
గా రాఁడు మూడులోకముల నెందు, ౨౦౬

చ॥ ధనమును రూపమున్ మిగుల దర్పము గల్గి రసజ్ఞభిన్నుఁడౌ
జనవరు గర్వధూర్వహు వెసన్ వరియించి తదీయమైత్రి నె
క్కొను చెలికిం బ్రతిక్షణ మగున్ మరణంబు రసజ్ఞుఁడై నని
ర్ధనుని వరించి తాఁ బ్రతిపదమ్ము ముదమ్మున నుండ నయ్యెడిన్. ౨౦౭
గీ॥ మూర్ఛనాజ్ఞానభేదమ్ము మొట్టమొదటి, కరసి స్వరవేదియై గ్రామ
పరిచితిఁ గని, యష్టరసవేత్త యగునరుం డంగవికలుఁ, డయ్యునా
నంద మొసఁ గూర్చు నంగనలకు. ౨౦౮

క॥ స్వరవేత్త యైనగాయక, వరుఁ డిమఁ గైలాససుఖము వమ్ముగ మూ
ర్ఖుల్, సురనదికి సరస్వతికిం, దిరుగుదు రీరస మొకింత దెలియనికతనన్
క॥ స్వరభేద మెఱిఁగెనేనియు, నరుఁ డయ్యును నతఁడు దేవనాథుఁడ
దానిం, బరిశీలింపఁడయేనిన్, సురనాథుం డయ్యుఁ బశువుసు మ్మ
తఁ డంబా. ౨౦౯

గీ॥ మూర్ఛనాతానసమ్మోహమున మనమ్ము, గరఁగుహరిణులు పశువు
లు గావు సూవె, దాని విని సంతసంబు నందనివాఁడు, తల్లి! ప్ర
త్యక్షపశువు తథ్యముగ వినుము. ౨౧౦
క॥ వినఁ జెవులు గలిగి మోదం, బెనయనియరసికులకన్న నెంతే మో
దం, బును గానరసముకతనన్, గనునశ్రోత్రములు మేలు కాకోద
రముల్. ౨౧౧

క॥ గానంబువినికి పశువుల, నానందరసాబ్ధి నోల లాడించెడి న, ద్దాని
వినఁ బెద్ద లాదర, మూననిచో వారిజన్మ మొకజన్మంబే. ౨౧౨

చ॥ తెలియఁడు గాక నారదునుదీర్ణ గుణమ్ములు రాజు; ముజ్జ గం
బులఁ గలఁడే యొకం డతనిఁ బోల్పఁగ గానమునందుఁ; బూర్వమే
వలచినదాన నమ్మునిని; వానరవక్త్రము శాపకారణం
బలవడి నేఁడు వచ్చె నెటులైన నతండు ప్రియుండు నా కగుఁన్. ౭౨౩

క॥ తురగాస్యులుగా రేకి, స్నరు లెల్లరువారిఁగాంచినరుఁడెవ్వఁడు గా
నరసజ్జుఁడాదరింపఁడు, మురువందియు విద్దెలేని మొగమేమిటికిన్. ౭౨౪

వ॥ అమ్ముని యెట్టిఁడైన నాకుం బ్రియుం డతనిఁదక్క వేఱొ
క్కని మదనుండైన నే నొల్ల ననియు నాగ్రహమ్ము ద్యజియించి న
న్నమ్మునికిచ్చి వివాహం బొనర్పు మనియు నీ వరిగి మజ్జనకునకు బో
ధింపు మనుడుఁ గైకేయి భర్త కడ కరిగి కడచినవృత్తాంతమ్ము విన్నవిం
చిన నతండును నా కొసఁగ నంగీకరించి వివాహసంభారమ్ము లొనర్చి వి
ధివిధానంబుగఁ బెండిలి యొనర్చెఁ బిమ్మట వానరవక్త్రుండ నగుకతన
దందహ్యమానం బగుమనమ్ముతో నచ్చటన యుంటి నక్కన్నియ న
న్ను సేవింప నేతెంచినప్పుడెల్ల మన్మనంబు శోకమగ్నం బగు నావై
రూప్యమ్మునకు దమయంతి యించుకేనియు శంకింపక సంతసమ్మునం బొ
దలు నట్లు కొంత కాలం బరుగుమీఁదఁ బర్వతుండు నానాతీర్థమ్ములు
సేవించుచు ధరణినెల్లెడఁ గ్రుమ్మరి మగుడ నన్నుఁ జూడ నేతెంచి నా
చే సన్మానితుండై యాసీనుండై నన్నుం గృతదారు వానరాస్యుఁ జిం
తావిష్టుఁ గాంచి యత్యంతదుఃఖితుండై మేనమామను నగునాయెడ ద
య గలిగి యిట్లనియె. ౭౨౫

గీ॥ కోపమున మున్ను శాపమ్ము గొంక కిడితి, నిపుడు నిష్కృతి నొన
రింతు నీనృపాల పుత్త్రికై, కరుణించితిఁ బూర్వరీతి, సుందరాస్యుం
డ వగుము మత్సుకృతపటిమ. ౭౨౬

వ॥ అంత నేనును నతని కిట్లంటి నీశాపమ్మునఁ గలుషితచిత్తుండ
నై శపించితి నిపుడు ప్రసన్నుఁడనై నీకు శాపమోక్షం బొనర్చెద
నెప్పటియట్ల నీకు స్వర్గగమనం బలవడుఁగాక నాపుడుఁ బర్వతుండు

సంతుష్టుండై తనంత నరిగెఁ, బదపడిరాజపుత్రి పట్టరానిసంతోషమ్మున దల్లికడ కరిగి యిట్లువిన్నవించె. 227

గీ॥ మాత? నీదుజామాతకు మగుడ నుంద, రాస్యత ఘటిల్లెఁ బర్వతుం డాగ్రహంబు, విడిచి శాపమ్మునకు ముక్తి నుడువుకతన, ననుదుభర్తకుఁ జెప్పె నయ్యాతివ యరిగి. 228

వ॥ పిమ్మట సంజయుండు తద్వచనశ్రవణంబున సంతుష్టుండై స మంత్రిపురోహితమ్ముగా నాకడ కరుదెంచి పారిబర్హం బొసఁగి మద్భాగినేయునకుఁ దగుధనం బిడి గారవించె. 229

క॥ ఏరికినైనఁ గలదె సం, సారమ్మున సౌఖ్య మెట్టిజ్ఞానులకుఁ మా, యారచన దాఁట శక్యమె, యారయు మిది యెల్ల నాకు ననుభవ మయ్యెన్. 230

గీ॥ కామమును క్రోధమును నహంకారము మద, మత్సరంబులు లోభంబు మమత యివి య, హీనబలములు వీని జయించు నెవఁడు, త్రిగుణహేతుకమై యొప్పు దేహ మొంది. 231

వ॥ వినుము మున్నొక్కనాఁడు విష్ణువుతో వనమ్మున నేగుచు హాస్యవినోదమ్మున నమ్మహాత్ముకతన నేను స్త్రీరూపమ్ము గని మాయాబలమోహితుండ నగుటం జేసి యొకరాజునకుఁ బత్నినై యనేకులఁ గొమరులఁ గంటి నాపుడు నే నిట్లంటి. 232

ఉ॥ నారద? సందియం బొకఁడు నామదిఁ దోఁచెడి జ్ఞాని వైననీ వేరహి నారి వైతి? సుతు లేన్నృపుసంగతి నుద్భవించి? రీ పూరుషభావ మెక్కరణిఁ బొందితి పిమ్మట? మాయ యెంతకు న్నేరదె తన్మహత్త్వము గణింపఁ దరంబె వచింపు నాపుడున్. 233

నారదుఁడుస్త్రీయయిసంతతింగనుట

వ॥ నారదుం డిట్లను దేనికతన బ్రహ్మాదిస్తంబపర్యంత మీజగంబు పరిభ్రమించుచుండు నమ్మాయ దుర్విభావ్యయు నజయు యోగిమ జ్ఞేయయు నని యెఱుంగుము. 234

గీ॥ సత్యలోకమ్మునుండి సుస్వరము సామ, గానము నొనర్చికొంచు నేఁ గదలి విష్ణు, దర్శనాకాంక్ష నెమ్మదిఁ దవిలి యరిగి, సకలలోకమ్ములును జేరి సంచరించి. ౨౩౫

శా॥ శ్వేతద్వీపమునందుఁ గౌస్తుభమణిశ్రీరాజితోరస్స్థలున్
పీతద్యోతిపటున్మహాత్ము గరుణాబ్ధిన్ శంఖచక్రాదికో
పేతున్ బాహుచతుష్కభాసురు జలస్ఫీతాంబుదశ్యాము ల
క్ష్మీతన్వీసహచారిఁ గంటి సతులక్రీడాపరున్ శ్రీహరిన్. ౨౩౬

ఉ॥ ఆతనిభార్య రూపవరయౌవనగర్విత సింధుజాత భూ
షాతతిభాసమాన ననుఁ జక్కటిఁ గాంచి గృహమ్ములోనికిన్
వే తరలెన్ బదంపడి కవిప్రవరేణ్య రమేశు మ్రొక్కి శం
కాతిగమైనచేతమున నమ్మధువైరికి నిట్లు వల్కితిన్. ౨౩౭

క॥ విటుఁడనో ధూర్తుండనో నే, జటిలుఁడ జితమాయుఁడన్ బ్రశ
స్తహృదయుఁడన్, దటుకున ననుఁ గని చనె నీ, కుటిలాలక యి
ట్లొనర్పఁ గూడునె యెందున్. ౨౩౮

వ॥ నావుడు గర్వధూర్వహమ్ము లగుమద్వచనమ్ములకుఁ గనలక వీణాలాపమధురమ్ము లగువచనమ్ముల నద్దేవుం డిట్లనియె. ౨౩౯

క॥ పతిఁ దక్క నన్యసన్నిధి, సతి నిలువం దగదు నీతిచందం బిది యే, మతిమంతు లైనమాయా, గతికిన్ లోఁబడక యుండఁగాఁ గలరె మునీ. ౨౪౦

క॥ జితమాయతులున్ సాంఖ్య, స్థితివేత్తలు నైనమునులు దేవతలును ద, ద్గతు లగుచు నుండ, మాయా, గతి గీశజ్ఞునకు నీకుఁ గడవఁ దరంబే. ౨౪౧

గీ॥ ఏనుబ్రహ్మయు శివుఁడును నిద్ధతేజు, లైనసనకాదులును దదధీను లకట!, దేవతిర్యఙ్మనుష్యాది దేహధారు, లం దెవఁడు దాఁటు నమ్మాయ నజ నమేయ. ౨౪౨

వ॥ వేదవిదులొండె యోగవిదులుండెఁ ద్రిగుణమయ దేహధారుల కాని యన్యులుకారు తాదృశుల కేరికిని నయ్యది జయింప వశముకా దని యెఱుంగుము, మఱియు రూపహీనమ్మును స్వరూపకారియు నగుకాలమ్ముగూడఁ దత్తాత్కకమ్మకా నెఱుంగునది. ౨౮౩

ఉ॥ కాలవశమ్మునన్ వఱలు జ్ఞానియు మూర్ఖుఁడు మధ్యముండు న
క్కాలము సేయు ధర్మరతుఁగా వికలాత్మునిఁగాఁ దదన్యుఁగా
శీలమొ కర్మమో యిటులుచేయుటకున్ మఱి యన్య మెద్దియో
మూల మెఱుంగ రా దఖిలమోహనమై తగుఁ గాల మెయ్యెడన్.

వ॥ అని చెప్పి యమ్మహామహుండు విరమించుటయు నేను విస్మయావిష్టుండనై మహాత్మా! మాయ యనఁగ నెట్టిది? దానిబలం బెంత? రూపం బెట్లుండు? నది యెట వసించు? దేని కాధారం బగు? నాన తిచ్చి నాకు నద్దాని నగుపడఁ జేసి యనుగ్రహింపు మనవుడు రమేశుం డిట్లను నయ్యది త్రిగుణయు నఖిలాధారయు సర్వజ్ఞయు సర్వసమ్మతయు నజేయయు ననేకరూపయునై జగం బఖిలంబును వ్యాపించి యుండు. ౨౮౫

ఆ॥ వె॥ దానిఁ జూడ నభిమతం బేని గరుడు నా, తోడ నెక్కి మిపుడ తొలఁగి చనుద, మజతనూజ మాయ నరయంగఁ జేసెద, దానిఁ గాంచి ఖేద మూన నలదు. ౨౮౬

వ॥ అని వినతాసుతుని సంస్మరించిన నతండు సన్నద్ధుండై యరుగుదెంచెఁ బదంపడి యిరువురమును నతనినధిష్ఠించిన నాగరుత్మంతుండు వాయువేగమ్మునఁ గదలి హరిప్రేరితుండై వైకుంఠమ్ము విడిచి.

క॥ పురములు వనములు నదులున్, ధరములు మునిపల్లెలున్ హ్రదమ్ములు మాకుం, గర మానంద మొసంగఁగఁ,దిరిగితిరిగి యాతఁ డొక్కదేశము చేర్చెన్. ౨౮౭

మ॥ అటఁ గన్గొంటిమి కాన్యకుబ్జ మనునీ; డాపొల్లికిన్ జేరువన్
దటరాజద్విభాగమంబు కమలాధారంబు నానావిధో

త్కటవర్ణస్వరభాస్వరాండజసముద్యన్మధ్యభాగంబు సం
ఘటితానందము స్వచ్ఛనీరము తటాకం బొందు గానం బడెన్.

వ॥ అయ్యెడ శ్రీహరి నా కిట్లనియె.

క॥ నారదః కనుఁగొంటివె కల్హారచ్ఛన్నంబు సారసారావరసో
దారంబు స్వచ్ఛనీరఁ, బై రంజిలునీతటాక మపరిమితమై. ౭౫౦

వ॥ అని పల్కుచు మందస్మితకందళితముఖారవిందుండై నాచి
చిటికెనవ్రేలు పట్టికొని స్నిగ్ధచ్ఛాయం బగుతత్తటమ్మునకు డిగి సరోవ
రంబుపొంత దృష్టి నిగుడ్చి మరల నిట్లనియె. ౭౫౧

క॥ అరసితె సాధులచిత్తము, కరణిన్ స్వచ్ఛమ్ము లగుచుఁ గాలెడిఁ
గంజా, త రజస్సౌరభపరిచితి, సురుచిరములు జలము లిందుఁ జూ
పఱు వొగడన్. ౭౫౨

వ॥ ఈసరోవరమ్మున స్నానం బొనర్చి పిదపఁ గాన్యకుబ్జపురమ్ము
వీక్షించి యరుగుదము మొదల నీవు స్నాతుండవు గ మ్మనుపదంబ
యేనును నొనర్చెద నావుడు వీణయు మృగాజినమ్మును నొక్కెడ నుం
చి తీరమ్మునకుం జని పాదప్రక్షాళనం బొనర్చికొని కరంబులు గడిగి శి
ఖాబంధం బొనర్చి కుశలు ధరించి కృతాచమనుండనై లోనికిం డిగి
స్నానంబు సలుపునంత. ౭౫౩

క॥ హరి చూచుచుండ నాకుం, బురుషాకారంబు వోయి భూషణకాం
త్యా, ద్భుతమై స్త్రీరూపము కర, మరుదుగ సంప్రాప్త మయ్యె న
ది యే నెఱుఁగన్. ౭౫౪

వ॥ అంత హరి నాకృష్ణాజినమ్మును వీణయుం బుచ్చికొని గరు
డు నెక్కి యొక్కక్షణమ్మునన తనభవనమ్మున కరిగె. ౭౫౫

క॥ వ్యాసా! యేమని చెప్పుదు, నాసంగతి వీణయున్ మృగాజినమున్
శ్రీ, వాసుఁడును స్మృతికిఁ దగులరు, కాసారము వెడలి తటము గ
నుఁగొనునాకున్. ౭౫౬

శా॥ ఆలీలన్ జెలినై సరోవరతటంబందుండి నల్దిక్కులున్
బోలం జూచెడివేళ భృత్యులు గజమ్ముల్ ఘోటముల్ తోడ రా
నాలస్యం బొకయింత లేక యరదం బాదిక్కు రా నిచ్చి నన్
దా లౌల్యం బడరన్ గనుంగొనియనున్ దాలధ్వజుం డొప్పుగన్

క॥ నరసుందరివో? సురపం, కరుహాక్షివొ? నాగకన్యకామణివో? కి
న్నరమత్తకాశినివొ? యెం, టరినై యిట్లుంటి వక్కటా? గజగమనా

క॥ బాలవు యౌవనరూపవి, శాలవుఁ నినుఁజూచి మనము చంచలమై రా
గాలోల మయ్యెఁ జెడిలి, కాలేదే నీకు నిజముగాఁ దరళాక్షీ

ఉ॥ ఏమిటి కీసరోవరము నెల్లెడఁ గన్గొనె దోలతాంగి? నీ
కై మరు లూనినాఁడ నను నారసి చేకొని పేర్మి మీఱ ని
స్సీమసుఖమ్ములం బడయఁ జెల్లదె యింత యనాదరంబె నా
గా మహిపాలసూను నటఁగాంచి వచించితి లజ్జపెంపునన్. 292

క॥ నీయిచ్చవచ్చినట్టుల, న్యాయగతి నన్నుఁ జూచు నావుడు నృపుఁడ
త్యాయత మగు ప్రేమమ్మున, నాయనురాగంబెఱింగినరయానమ్మున్.

వ॥ తెమ్మని భృత్యుల నియోగించిన వారలు చతుర్వాహ్యమ్ము నుమృద్వాస్తరణసంయుతిమ్మును కౌశేయాంబర వేష్టితమ్మును ముక్తాజాలవిభూషితమ్మును జతురశ్రిమ్మును సువర్ణఖచితమ్మును విశాలంబును మనోహరంబును నగుశిబికం దెచ్చిన నద్దాని నధిరోహించి యారాజను న్మథువెనువెంటఁ దత్పురమ్మున కరిగి శుభలగ్నమ్మున నగ్నిసాక్షికంబుగ నతనిచే వివాహితనై సౌభాగ్యసుందరి యనునామమ్మున నొప్పి యతని కిఁ బ్రాణమ్ముల కెక్కుడై సంభోగ సుఖమ్ము లొనఁగూర్చుచుంటి. 293

ఉ॥ ఆనృపుఁ డెల్లకార్యములయం దపరక్తి వహించి మించి యు
ద్యానములందు దీర్ఘికలయందు గృహమ్ములయందు వారుణీ
దూనమున్కుఁడై రతులతోఁ దులఁదూఁగుచు రాత్రియుం బవల్
తా నెఱుఁగంగ లేక పరతంత్రత వర్తిలు నా కధీనుఁడై. 294

శా॥ వ్యాసా! యేమనిచెప్ప వచ్చు విను మాయాచాకచక్యంబు క్రీ
డాసక్తిన్ దగు లోందునా కడఁగె బ్రహ్మజ్ఞానపుంభావవి
శ్వాసంబుల్ మఱి "యేన పట్టమహిషిన్ సర్వంబు నాసొమ్మ నా
కేసాధ్వీమణు లీ"డటంచు మది నెంతేఁ దాల్తు గర్వాంధతన్. ౨౬౫

గీ॥ ఇటు లహర్నిశ మాభూపు నెనసి ద్వాద, శాబ్దముల్ కామకేళీవి
హారములను, గొనఁగ నంతటఁ వేకఁటి యనుఘటించె, బార్థివోత్త
ముఁ డానంద వార్ధి మునుఁగ. ౨౬౬

క॥ చూలాలినైననను భూ, పాలుఁడు దగ బుజ్జగించి బాలరో! నీ కెం
దే లోలత నాఁ జెప్పం, జాలన్ లజ్జాభరం బశక్య మ్మగుటన్. ౨౬౭

క॥ పదినెలలు నిండఁ గంటి శు, భదినమ్మున నొకతనూజుఁ బార్థి
వుఁ డానం, దదశఁ దగి యుత్సవం బ, భ్యుదయంబునఁ జేసె నింగి
భూమియు ముట్టన్. ౨౬౮

వ॥ బ్రాహ్మణానుమతమ్మున నక్కొమరునకు వీరవర్మ యనునామ
మ్ము వెట్టియానందసాగరమ్మున నోలాడుచుండఁ బిదప రెండువత్సరమ్ము
ల కింకొక్కరుఁ గంటి భూపాలుండు వానికి సుధన్వుం డనునామం బిడి
యె నట్లు క్రమక్రమమ్ముగ ద్వాదశపుత్రులం గని మోహవశమ్మున
వారల లాలించుచున్నంత మరల నెనమండ్రు కొమరు లుద్భవించిరి.

క॥ నృపతికి నాకును గార్హ, స్థ్యపదవి సఫలం బటంచు దానం దోఁ
చెన్, రిపుశాసకు లీకొమరుల, కుపయమ మొనరించె భూపుఁ డొ
క్కొక్కరికిన్. ౨౬౯

క॥ కొడుకులు కోడండ్రును న, క్కొడుకులకొడులును వారికులకాంత
లు నే, ర్పడ నధికమై కుటుంబపు, గొడవ విశేషించె మదికిఁ గుతు
కం బొదవన్. ౨౭౦

గీ॥ అంత నొకయెడ నైశ్వర్య మమరు దుఃఖ, మొక్కయెడఁ గల్గు
సౌఖ్యంబు నొక్కయెడల, నెసఁగు నొకఁడు గృశించుఁ బెంపెన
యు నొకఁడు, పెద్దగేస్తుల కియ్యది విహితమశద. ౨౭౧

ఆ॥ వె॥ కొడుకులందు నట్లు కోడండ్రయందు మ, నుమలయందు వారి
ప్రమదలందుఁ, గలుగు నొక్కతఱిని గలహంబు లయ్యెవి, తీర్పు
లేక నాకు దిగులు దగులు. ౨౨౨

క॥ బలవంతులు నాపుత్రులు, కులసంభవలెల్ల నాదుకోడండ్రు
నా, కలిమికి వేఱొకకలుకుల, కలుములు సరియే యటంచు గర్వ
ము ప్రబలెన్. ౨౨౩

గీ॥ ఇట్లహంకారమున మున్ని "యేను నార, దుండ న న్నిట్లు చేసె
నప్పుండరీక, లోచనుం" డని యొక్కింత లోనఁ దలఁప, కెలమి
సంసారసాగర మీఁదుచుంటి. ౨౨౪

వ॥ అంతఁ గొంత కాలమ్మున దూర దేశంబునుండి యొక్కనృపా
లుండు సైన్యసమేతమ్ముగ నక్కాన్యకుబ్జపురం బరికట్టిన నాకొమరులు
ను మనుమలును రథవారణతురంగమపదాతిసమేతమ్ముగ రాజుతోడ
నతని నెదుర్కొనినఁ దుములం బగుసంగరంబు ప్రవర్తిల్లె. ౨౨౫

క॥ ఆసంగరమున శత్రులు, చే సమసిరి కొమరులెల్లఁ జేయునదియులే,
కాన యొడలి నరపాలుఁడు, తా సదనమ్మునకు వచ్చెఁ దద్దయు నార్తిన్

వ॥ నన్నుం గాంచి పుత్రపౌత్రులెల్ల శత్రునిహతు లగుటఁ
దెల్పిన నేనును శోకంబు పట్టఁజాలక రణభూమి కరిగి. ౨౨౬

ఆ॥ వె॥ కొడుకులార? నాదుకడుపునఁ జిచ్చిడి, యడవి నిల్లుగట్టియాత్మ
జాతు, లెల్లఁ దోడఁ రాఁగ నేగంగఁ దగునె దు, ర్వారమైన దై
వవశముకతన. ౨౨౭

వ॥ ఇట్లొడలెఱుఁగక నానావిధమ్ముల విలపించునాకడకు మధు
సూదనుండు వృద్ధవిప్రవేషమ్మున వచ్చి నన్నుం గాంచి యిట్లను. ౨౨౮

ఉ॥ ఏల విచారమంద వినుమీ? భ్రమ గాక మఱెవ్వ రీసుతుల్
పోలఁగఁ జూడు నీవెవ తెవో? యొక రొడ్లకు నేమి గావలెన్?

గాలవశమ్మునన్ మృతిని గాంచినవారల కింత యేల? యీ
జాలము మాని స్నానమును సల్పి నివాపకృతిం బొనర్పుమా. ౨౮౦

క॥ పరలోకగతులకొఱకై, వ్వరునింటం దాన మాడవలవదు తీర్థం,బరి
గియుటఁగుఱ్ఱింకులిడుటయు, మఱియాదసమస్తధర్మమార్గములందున్.

వ॥ అని పలికి బంధుసహితమ్ముగా నన్ను వెంటఁ బెట్టికొని య
మ్మహామహాలుండు పుంతీర్థంబనునొక్కసరోవరమ్మునకుఁ జేర్చి యోదార్చి
యిట్లనియె. ౨౮౧

ఉ॥ స్నాన మొనర్పు మిచ్చట; మనమ్మున నెవ్వరి కేడ్చుదాన వో
మానిని? యెన్ని జన్మములు మాటికి నెత్తితివో? భర్త లెందఱో?
సూనులుఁ దండ్రులున్ మఱియు సోదరులన్యులు నెందఱైరొ స్వ
ప్నానుగతిం జెలంగు భవమందిటు భ్రాంతి వహించు టొప్పునే.

వ॥ అనునాతని ప్రేరణమ్మున నప్పురుషతీర్థమ్మున మునిఁగి తల
యెత్తునంతకుఁ బురుషాకారుండనై తటంబున మహతియుఁ గృష్ణాజి
నంబును బూనియున్నకమలలోచనుం గాంచి. ౨౮౩

క॥ "ఏనారదుండ నన్నున్, శ్రీనాథుఁ డిట్లొనర్చె స్త్రీగా" నని నా
లో ననుకొనియెడియాలోఁ, దా నిట్లను రమ్ము నారదా? తడవేలా

క॥ అనునాతనిపలుకుల నొ, డ్డునకుం దగ వచ్చి చూచుదున్ వెనుకటి
య, వ్వనితాత్వం బప్పటి పుం, స్త్వనిరూఢియు మఱపువచ్చె సక
లము ననఘా. ౨౮౫

వ॥ అట్లు స్వస్వరూపంబు ప్రాపించి బ్రాహ్మణుండనై యున్న
నన్నుం జూచి యానృపాలుండు విస్మయావిష్టుండై నాభార్య యిట్లు
ముని యగుట కేమికతం బని యోజించుచు. ౨౮౬

ఉ॥ హా యను నన్ను వీడఁ దగవా పగవాఁడనె యోమృణాలబా
హా? యను నెట్టు లాఁగఁ దగుఁ బ్రాణము లిమ్మెయిఁ గాంచనాభదే
హా? యను రాజ్య మేల నిను నందక వాక్యజితాంగజాత వా
హా? యను మాట కుత్తరమునైన నొసంగవు నిస్పృహా? యనున్.

చ॥ వెనుకటిప్రీతి నామొడల వెక్కసమాయెనె యిప్డు? లేక యి
వ్వనమున మన్ని మత్స్యములపా లయితో? వరుణుండు నాయద్రు
ష్టనియతి నిన్ గ్రహించెనొ? విశాలవిలోచన? కృత్రిమంబు గా
దనఁ దగు నీదుపేర్మి సుతులం; దటుగామి నిటుల్ ఘటించునే.

క॥ దీనుఁ డగుపతిని విడిచియు, సూనులయెడఁ బేర్మిమిగులఁ జొప్పడు
కతనన్, దో నేగితి భార్య పుత్రానుగతికిఁ జెడితి నేమియనుకొం
దు నిఁకన్. ౭౯౦

క॥ ఇటులైనను మృతి నాకున్, ఘటియింపద దుఃఖ మెవరికడఁ జెప్పె
దున,క్కట రాముఁడైన లేఁ డు,ద్భటభార్యావిరహదుఃఖభరమతఁ
డెలుఁగున్. ౭౯౧

క॥ సచుచిత్తులు దంపతులో,క్కమొగిన్ మృతిఁబొందునట్లుగా నల్పుఁడ
నైఁ, వమ; మునులోనర్చి రుపకా,రము శాస్త్రములందు సహమర
ణము సతులకున్. ౭౯౨

వ॥ అని బహు ప్రకారంబుల విలపించు తాలధ్వజునకు మధు
సూదనుండు సయుక్తికమ్ము లగువచనమ్ముల నిట్లనియె ౭౯౩

గీ॥ ఏల దుఃఖించెదవు నరపాల? నీదు, భార్యయేమాయెధర్మంపుఁబద్ధతు
లను, వినవె? బుధసేవ లేదె? యీ వెలఁది యెవ్వ?,రీ వెవరు? యో
గము వియోగ మెట్లు మీకు. ౭౯౪

గీ॥ అధిప? సంసార మనుప్రవాహంబునందు, నెవరి కెవ్వరు? రోదన
మింత యేల, యింటి కరుగుము నొకపై నెక్కి దాఁటు, వారిచందం
బకాదె సంసారరీతి. ౭౯౫

క॥ నీ కాలతాంగితోఁ దగె, నేకతమున యోగ? మెఱుఁగు దే నీవు నృపా
యాకలికితల్లి దండ్రుల, శోకింపకు దైవచర్య చోద్యముకాదే. ౭౯౬

గీ॥ కాకతాళీప్రసంగమక్కలికిపొందు, గాన శోకంబువిడిచి వేగ గృ
హ మేగి, కాలచోదిత మైనభోగంబు గొనుము, వచ్చినట్టులయేగె
నవ్వనరుహాక్షి. ౭౯౭

క॥ రోదనమొనర్చి నీ వీ, మీఁదం దేఁగలవె దాని; మేకొను యోగం
బేదియు దైవాధీనతఁ, గాఁదగునద్దాని నాఁగఁగా శక్యంబే ౨౯౭

గీ॥ కాలవశమునఁ గల్గుభోగంబు దాని, కతనన యడంగు నద్ది యొకా
నొకప్డు, నిష్ఫలం బగు సంసారనీరనిధి ము,నింగి శోకింతురే? యిది
నీక తగెనె. ౨౯౮

క॥ ఘటికాయంత్రము వడువు న, నటు నిటు సుఖదుఃఖములకు నగు
భ్రమణ మ్మొ,క్కటనునికి చొప్పడదు సం, కటపడకుము పురికినేఁగఁ
గాఁ దగు నింకన్. ౨౯౯

వ॥ కావేని రాజ్యమ్ము దాయాదాధీనం బొనర్చి వనమ్మునకరుగు
ము ప్రాణులకు మానవదేహంబు దుర్లభంబు క్షణభంగురంబగునద్దా
ని నొందినవానికి నెల్లైన నాత్మసాధనం బావశ్యకం బగు. ౩౦౦

క॥ పరికింపఁగ జిహ్వోప, స్థరసంబు సమస్తజంతుసాధారణ మా
నరులకుఁ దక్కిన జ్ఞానం బరయంగా రాదు దానియందు నృపాలా.

క॥ కాంతావిరహోద్భవ మగు, చింతన్ విడనాడి గృహము చేరు
ము జగ ము, త్యంతముమాయామోహిత,మింతయు నద్దానికతననే
నీ కబ్బెన్. ౩౦౨

వ॥ అనుశ్రీహరివచనంబుల నతండు గృహం బరిగి జ్ఞానసంప
న్నుండై సుఖం బుండె నట్లు నృపాలుం డేగిన పిదప నన్నుం గాంచి మా
టిమాటికి మందస్మితం బినుమడించు మధుసూదనున కే నిట్లంటి. ౩౦౩

క॥ దేవా! వంచన చేసితి, వీ వమ్మాయాబలంబు నెఱిఁగితి నిపుడున్
భావమునఁ దోఁచు వనితా, భావమ్మున నే నొనర్చు పను లవి
యెల్లన్. ౩౦౪

చ॥ మునిఁగితి నత్తటాకమున మున్గినయంతన యెట్లు నాకుఁ గ
ల్గెనో వచియింపు విస్మృతి; మృగీనయనాకృతి చెందినప్పుడున్
మనమును దేహలింగములు మాఱెనె యయ్యవి కాక జ్ఞాననా
శన మగు టెట్లు నాకుఁ గలసందియ మియ్యది వాపు మచ్యుతా.

చ॥ నృవవరునిఁ వరించి యొకనేమము లేక యనేకభోగముల్
క్షపయు నహంబటం చెఱుఁగఁ జాలక పొందుచు మీఁద మద్యపా
నపుఁగృతి సల్పుచుఁ మెలఁగినాఁడ సతీమణినై మహాత్మ? నేఁ
దపసిని నారదుండ ననుశత్వ మొకింతయుఁ దోఁప దక్కటా ౮౦౯

క॥ ఇయ్యెడ సర్వము తెలియఁగ, నయ్యెడిఁ గత మేమి యప్పు డటు
లాటకు నేఁ,దొయ్యలినై సలిపినకృత్యము, లయ్యారే? తలఁచికొనిన
నత్యద్భుతమా. ౮౦౭

వ॥ నావుడు జగదీశ్వరుం డిట్లను మునీంద్రా? యిది యంతయు
మాయావిలాసంబ కాఁ దెలియుము సర్వజంతువులకును జాగ్రత్స్వప్న
సుషుప్తితురీయంబు లనునాలు గవస్థలు కలవు దేహాంతరప్రాప్తి య
గునపుడు పూర్వజ్ఞానంబు నశియించుట కేమిసందియము. ౮౦౮

క॥ నిదురం జెందినమనుజుఁడు, పదపడి యొక్కింత యెఱుక వడయఁడు
పలుకం, డేది వచియించినఁ దెలియం, డది యెడలినమీఁద నెఱుఁ
గు నఖిలం బనఘా. ౮౦౯

వ॥ మఱియు నిద్రావస్థయందు మనోభావమ్ము లనేకగతుల మా
ఱుచుండు నెట్లంటేని. ౮౧౦

గీ॥ మృతుఁడయినతాత తనయింటికేగుదేర, నతనితోఁగూడి భోజనం
బాచరించి, తగుప్రసంగం బొనర్చునిద్ర నొకయప్డు, స్వప్ననశము
న నిది యెంత సత్య మగునొ. ౮౧౧

ఆ॥ వె॥ స్వప్నమందుఁ దనకు జరిగినదంతయు, మేలుకాంచి నుడువుమిథ్య
యనుచు, నెవఁడుగాని యప్పుడెఱుఁగంగ నేర్చునే, భ్రమ యటం
చు నింత పలుకుమయ్య. ౮౧౨

క॥ మాయాగుణవిలసన మది, యేయయ్యలకెఱుఁగవచ్చు నిది దుర్ఘట
మ, తోయజభవుఁ డేనును దుర్జ్ఞేయమ్ముగఁ దలఁతు మగ్గిరిశుఁడుఁ
మానీ. ౮౧౩

గీ॥ తలఁప జగమంతయును గుణత్రియకృతంబు, లేదు సంసారమున ల
వలేశమేని, గుణవిహీనపదార్థంబు గుణివరేణ్య! యేను సత్త్వప్రి
ధానుఁడ నెఱుఁగు మింత. ౮౧౪

వ॥ తక్కినరెండును నాకు నుపసర్జనమ్ములుగాఁదెలియుమొక
ప్పుడును గుణవిరహితుండనై యుండ నట్ల బ్రహ్మకు రజంబు ముఖ్యం
బు సత్త్వతమము లప్రధానంబులు హరునకుఁ దమంబు ప్రధానంబు స
త్త్వరజంబు లముఖ్యమ్ము లని చెప్పి వెండియు. ౮౧౫

చ॥ అగుణుఁడు నాకు నెయ్యెడలనారయరాఁడుమునీంద్ర! మోహముం
దగులకుమయ్య నాదుకతనన్ గనుగొంటివిశాదె మాయ దా
ని గణన చేయ శక్యమగునే! యది చేసెడివింతచేష్ట లో
కృగతి నెసంగ కద్భుతముగాఁ గనుపట్టు ననేక భంగులన్. ౮౧౬

గీ॥ అని హరివచించె నని చెప్పె ననఘ నాకు, నారదుండంత నేను నా
నంద మెసఁగ, మరల నాతని నడిగితి మాధవుండు, మగుడ నీకేమి
చెప్పి యరిగెను చెపుము. ౮౧౭

వ॥ అనవుడు నారదుం డిట్లను నట్లు బోధించి గరుఁడు నెక్కితన
నివాసమ్మున కరుగుచు నన్నుం గాంచి యిట్లనియె. ౮౧౮

క॥ నాతో వైకుంఠమ్మున, కేతెంచెదో? లేక నీ యథేచ్ఛ నరిగెదో?
వే తెలుపమన్న నడిగితి, నాతనియాజ్ఞ గొని సరసిజాసనుకడకున్

గీ॥ అరిగెఁ దనయంత వైకుంఠ మబ్జనేత్రుఁ, డేనుజరిగినవృత్తాంతమెల్ల
దలఁచి, కొంచుఁ జింతాతురతఁ దలవంచి యుండఁ, దండ్రి యిట్లనె
ననుఁ గాంచి దయ దలిర్ప. ౮౨౦

క॥ ఎక్కడి కేగితి? చింత, న్నక్కాఁ గతమేమి? తెల్పు నీ కస్వాస్థ్యం
బెక్కడిది? యెవరివంచనఁ,దక్కితి?యద్భుతంబాదవె నేమారయన్.

వ॥ నావుడు నే నిట్టటి మహాత్మా? విష్ణునిచే వంచింపం బడి
స్త్రీత్వం బంది యుండు ననేకవర్షమ్ములు పుత్రశోకాదిదుఃఖమ్ము లనేక

మ్ము లనుభవించి మరల నతనిచే బోధింపఁ బడి సరోవరస్నానం బొన రించి పురుషుండ నైతి నిమ్మాయాబలం బెట్టిదో యెఱుంగ నలవి కా కున్నయది తజ్జన్మమ్మున నాకుఁ బూర్వజన్మవిజ్ఞానం బింతయుఁ గనుప ట్టకుండె దీని నెట్లు జయింప నగు నని యోజింతు నీ వెట్లిద్దాని జ యించి మించితో నా కాయుపాయంబు తెలుపుము నావుడుఁ జతు రాననుం డిట్లనియె. ౧౨౨

చ॥ హరిహరులుఁ సురాసురులు నన్యులు మానులు నేను మాయవై ఖరి నొకయించు కేనిఁ గనఁగా దగువారము కామ శోకముం బొరయకుమయ్య యయ్యది విమోహితులం బొనరించు నందఱ న్గరము సృజించి పెంచును జగం బడఁగించు నొకింతలో పలన్.౧౨౩

క॥ జనకుండిటు బోధించినఁ, జనుదెంచితిఁ దీర్థయాత్ర సలుపుచు నిట కీ, వును గౌరవనాశనసం, జనితము దుఃఖంబు మఱచి స్వస్థతఁ గనుమా. ౧౨౪

క॥ కృతకర్మము లనుభగవతి, న తెఱుఁగు నీ కేల మనమునన్ జింతఁ గొనన్, ధృతిఁ గాల మిచటఁ గడపుము, గతమునకుం జింత సే యఁగాఁ దగ దేరున్. ౧౨౫

వ॥ ఇట్లు నాకు బోధించి నారదుండరిగెఁ బిమ్మట నేనాసారస్వత కల్పమ్మునఁ దత్సరస్వతీతీరమ్మున నుండి యీ భాగవతమ్ము గాలక్షేపార్థం బొనర్చితి. ౧౨౬

క॥ ఇది నానాఖ్యానయుతం, బిది సంశయ నాశకారి యియ్యది మో హా, స్పదమిది వేదప్రామా, ణ్యదమై తన రారు వినుము నరనాథ మణీ ౧౨౭

గీ॥ దారుమయమైన పాంచాలిఁ దనదుకరము,నందుఁ గొని నైపుణ్యము జా లికుండద్భుతముగ, నర్తనం బొనరించుచందమున జగము, నెల్ల నాడించు మాయయో నృపవరేణ్య. ౧౨౮

వ॥ సదేవాసురమానుషంబగు నీజగంబు బ్రహ్మాదిస్తంబపర్యంతమ్మును బంచేంద్రియయుక్తమ్మును మనశ్చింతాను వర్తనంబును గనియె ఉంగునది సకలమ్మునకును మాయాసముద్భవమ్ములగు గుణమ్ములు కారణంబు లయ్యెవి భిన్నభిన్నస్వభావమ్ములు కారణగుణమ్ములు కార్యమ్మున సంక్రమించుట శాస్త్రసమ్మతంబగుటం బురుషుండెల్లప్పుడును దద్యుక్తుండకానెయుంగుము తంతురహితంబగు పటమ్మును మృద్విరహితంబగు ఘటమ్మునుం బోలె దేవతిర్యఙ్మనుష్యాదుల నొక్కడనేనిం ద్రిగుణరహితుండు కల్ల. 29

క॥ శ్రీనాథ హరవిరించులు, భూనాయక! త్రిగుణయోగమునం బ్రీ
త్యప్రీత్యానందశూన్యతలం దా, మూఁడు రెల్లప్పుడింతయును ని
క్కముగుఁ. 30

వ॥ బ్రహ్మ సత్త్వగుణసంపన్నుండగునెడశాంతుండై సమాధిమంతుండై సర్వభూతములయెడం బ్రీతిగలిగి వర్తించు నంతసత్త్వం బెసలి రజం బావరించిన నెల్లెడలం బ్రీతిమాని ఘోరరూపుండైయుండు నట్లతమోగుణావిష్టుండై విషాదయుక్తుండును మూఢుండును నగు హరిహరులును నిట్టిరయని యెఱుంగుము. 31

ఆ॥ వె॥ చంద్రసూర్యవంశసంభవు లగురాజ, వరులుమనువు లెల్లసురలు నరులు, గుణము లనుసరించి గొనకొని చరియింతు, మాయం బడనివాఁడు మహిని లేఁడు. 32

క॥ భూనాథ! దేహిమాయా, ధీనతం బరతంత్రుఁడగుచుం దిరుగుఁ సంవి, త్తె నెగడెడి పరతత్త్వం, బే నెల వమ్మాయ కనుచు నెఱుఁగుము పేర్కిఁ. 33

వ॥ సంవిద్రూపిణి యగుపరమేశ్వరి స్వాయత్తం బగునమ్మాయ నెల్లప్పుడు జీవంబులపైం బ్రేరేపుచుండు. 34

క॥ కావున మాయాయుత న, ద్దేవిఁ ధ్యానించి మ్రొక్కి తేఁకువకలిమిఁ, భావించి పూజ చేసిన, కోవిదులకు ముక్తి గల్గుఁ గురుకులతిలకా. 35

క॥ తనుఁ గొల్చెడివారలపై, నెనరునఁ దనమాయ నడఁచి నిఖిలేశ్వరి ము, క్తి నొసంగఁ జాలుశుభదృ, ష్టిని నిగుడఁగఁజేసి ప్రోచు శీఘ్రముగ నృపా. ౮౩౬

క॥ భువనంబు మాయ దానికి, శివదాయిని శక్తి రాజ్ఞి, చెల్లుఁ దానన్, భువనేశి యనెడినామం, బవితథముగ నప్పరాంబ కాగమహితమై. ౮౩౭

ఆ॥ వె॥ ఆపెయందుఁ జిత్త మమరినవానికి, నవనినాథ! సదసదాత్మకంబు, మాయకతన నేయపాయంబు గల్గు న, ద్దాని నడఁప వలయుఁ దవిలి మొదల. ౮౩౮

గీ॥ సచ్చిదానందరూపిణి సకలజననిఁ, దక్క మాయ నడంప నితరులు గారు; సూర్యచంద్రవిద్యుత్ప్రభాశుచులఁ దక్కఁ, దమ మడంగునె తమముచేత నరనాథ. ౮౩౯

క॥ మాయేశ్వరియై సంవి, త్తై యలరుచు స్వప్రకాశ మలవడునంబన్ బాయక కొలువం దగు న, మ్మాయాగుణ మాఁగుఁబొంటె మానవనాథా. ౮౪౦

క॥ ఇది వృత్రాసురహరణము, మొదలుగ నీయడుగుప్రశ్నముల కుత్తర మి, య్యది యీపురాణమునకుం, బొదలుఁ బూర్వార్థ మగుచు భూపవతంసా. ౮౪౧

క॥ ఇందెల్ల యెడల నప్పర, సుందరిమహిమమ్ము వొలుచు సొలవక దీనిన్, మందుల కిడఁ దగ దియ్యది, విందగుఁ బరశక్తిభక్తివివశుల కెల్లన్. ౮౪౨

వ॥ ఇయ్యది భక్తునకును శాంతునకును శిష్యునకును జ్యేష్ఠపుత్రునకును నొసంగఁ దగురహస్యమ్మును వేదతుల్యమ్మును సకలకథాసారమ్మును సత్ప్రమాణానువిద్ధమ్మును నగుపురాణంబు దీని భక్తియుక్తుండై పఠించునరుండు జ్ఞానియు ధనియుం గాఁ గలఁ డని వ్యాసుండు జనమేజయునకుఁ జెప్పె ననుటయు. ౮౪౩

## ఆశ్వాసాంతపద్యములు.

చ॥ అనుపమశాస్త్రవిత్త్వవినయాదివిభాసుర భూసురాగ్రగ
ణ్యా నమదనేకశిష్యజననందనచందనవృక్ష ధర్మవ
ర్ధనచరితాలవాల విబుధప్రకరస్తవనీయకీర్తిభా
జన జననాథమౌళివిలసత్పదపద్మ మహామహాన్వితా. ౮౪౪

క॥ అంగజవైరిశిరస్సం, సంగిధునీభంగభంగసంధానచణా
భంగురవాగ్విజితప్రా, సంగికజనసార్వభౌమ సన్నుతనామా. ౮౪౫

మాలిని॥ వితరణగుణశాలీ విద్వదంభోజహేళీ
కృతసుకృతవిశేషా కేవలాద్వైతభూషా
నతదురితవినాశా నవ్యకీర్తిప్రకాశా
ధృతిసతతశరణ్యా ధీరవారాగ్రగణ్యా.

గద్య.

ఇది శ్రీ......తిరుపతి వేంకటేశ్వర ప్రణీతం
బయిన దేవీభాగవతంబను మహాపురా
ణంబునందు షష్ఠస్కంధము
సంపూర్ణము.

శ్రీమత్పరదేవతార్పణమస్తు.



# తప్పొప్పుల పట్టిక.



## 1వ స్కంధములో ముఖ్యముగా దిద్దఁదగినవి.

12వ, పుట 16వ. పంక్తిలో— నారదమున్నన నిరువదియైదు వేలును, అని చేర్చికోఁవగు, మఱియు, 31వ పుట, 1వ పంక్తిలోని, వేయినుడుంగులేల, అనునది వేయికదుక్తులేల, అని సవరించుకోఁదగు, తక్కుంగల— మూఁగురియందు, తిక్కన కవిత్వారంభము, సత్వ, సాత్విక, తద్జ్ఞుల, పుణ్యరాసి, చతుర్థమ్ము, పరగు అశ్వత్థామ, పుట్టినఁటంటి, గుణమ్ములనుఁబట్టి, ఒకఁట, తత్తరపాటు, దారకొండు పు, విస్సదనంబు, ఎల్లరికిఁ, పదఁపడి, నిశ్శంకఁగా, గుఱిచి, పాలార్చఁదొడఁగె మథించు, గానఁనొక, పెరిగనేని, వాఁకిట, రామజ్యమిది. లోనగుచోటులం గల, స్వల్పవ్యత్యాసములను యథోచితముగా సవరించుకోఁదగు.

## 2వ స్కంధములో.

అర్థ, ఉప్పరవీథులు, ఏటేటఁ, అరమర, యూపాశ్రమము, షష్ఠి ఎన్నటికి, ఆరగించ్నైతి. అనుచోటులు యథోచితముగ సవరించుకొనునది.

## 3వ స్కంధములో ముఖ్యముగా దిద్దఁదగినవి.

4వ పుట 4వ పంక్తిలోని, మీవి, ఘలను నెఱవేర్చికొనుఁడు పదుండు,, అను నది, మీప, నులను నెఱవేర్చికొనుఁడుచనుండు,, అనియును, 9.వ పుట, 4వ పంక్తిలోని —క॥ మము చెలికత్తెలమని అనునది, "మముఁ జెలికత్తెలమని అనియు, 53వ పుట 14వ పంక్తిలోని— ఇవ్వనికి గుదెంచిరో అనునది, ఇవ్వనికగుదెంచుటో; అనియును సవరించుకొనఁవగు, తక్కుంగల— ప్రియుఘుండు. నిస్సల్లక, రీతిఁగా. నబీజమ్ము, ఇందిరానఁ, మహాత్మ్యంబును, గిరిబోడి, బోనరిఁచె, ఏస్తుఫల్, పుణ్యపుఁజేత, ఇనుపురి, నంతియతఁడుషు, సాష్టాంగన్నహా, కార్యముగ డడది. నిక్కగముగ, ఇట్టిదకా తెలియుఁడు, చొఱఁబాఱ, పలుపురితో, విచిత్రతంబులు, ఏగెఁడు, మనంబునఁ గుఱికొల్పి, విధానం బొప్పెంగించెద, గఱుఁగు, కర్తలకుఁబలె, ముగురియందు. లక్ష్మణుఁజత, జాలువారఁదుడుకున, లోనగు చోటులంగల స్వల్పవ్యత్యాసములను యథోచితముగ సవరించుకోఁదగు.

## 4వ స్కంధములో.

భీష్మద్రోణాదుల, ఇదమిద్ధము, చేకూరెడి, బలరాతి, దీనఁజనించు, ఎఱింగినే, లోనగుచోటులందుగల స్వల్పవ్యత్యాసములను యథోచితముగ సవరించుకొనదగు-

## 5వ స్కంధములో ముఖ్యముగా దిద్దఁదగినవి.

74వ పుట, 12వ పంక్తిలోని,, ఏమిపనికి వచ్చిరొకొ,, అనునది, ఏమిపనికి వచ్చుటొకో, అనిసవరించికొని, తక్కుంగల—కదునెట్టఁగా, తెలువాండ్ర, అనురాగిల్లిన తిత్తిలోదరికి, ఇట్లనయోజింప, ఎం, దేరయుమార, మాతృపితృలకు, తీఱునే, కాండంమ్ములు, పోడిమి, భూతిమైబంబిన, రంగస్థలమ్ము, నేటితో, తఱిగె, ద్వంద్వమ్ము, లోనగు స్వల్పవ్యత్యాసములు యథోచితముగ సవరించుకొని, 112వ పుటలో, ౭౯౫వ, పద్యానంతరము, “వ॥ పదపడి యశరీరవాణి వారికిట్లనియె” అని చేర్చికొనఁదగు.

## 6వ స్కంధములో.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 4 | 14 | గఱఁగింప | గరఁగింప. |
| 9 | 1 | కాపురము | కాఁపురము. |
| 16 | 22 | అంబరీ వీవ | అంబరీ నీవ, |
| 25 | 22 | గలుగుణ | గలుగణ. |
| 29 | 26 | సిల్చి | నిల్చి |
| 40 | 20 | శుథ్యా | శుద్ధ్యా |
| 40 | 25 | పాలనమ్ములుదీర్ఘ | పాలనమ్ములను దీర్ఘ |
| 43 | 26 | కనఁ | కత |
| 52 | 26 | తెగఁదెంప | తెగఁద్రెంప |
| 63 | 22 | సురాసురల్ | సురాసురుల్ |
| 66 | 22 | సహితుండై | సహితుండవై |
| 72 | 14 | కుండము యనం | కుండముననయం |
| 76 | 19 | చిన్నతనమ్మున | చిన్నతనమున |
| 77 | 24 | వైఖిరి | వైఖరి |
| 78 | 15 | యగున్నన | యగునన్న |
| 82 | 17 | విదుర | విధుర |
| 82 | 21 | తనూజులు | తనూజల |
| 84 | 2 | యాలనఘ | లియలనఘ |
| 86 | 24 | మొసంగె | యొసంగె |
| 98 | 5 | స్ఫన్నంబు | ద్ఫన్నంబు |
| 99 | 7 | శాలపుఁనిను | శాలపునిను |
| 100 | 5 | వేకటి | వేఁకటి |